# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 22 అక్టోబర్ 1979 సంచిక 10

## విషయానుక్రమణిక



-: శ్రీవారి కార్యక్రమములు :-

బాబావారు ప్రశాంతి నిలయమునందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆనెంబరు "..../-11-1979" అనియుండిన, మీచందా నవంబర్ నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) అక్టోబర్ నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను. వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

10

లోకోపకారమనగా దీనికి ప్రథమ సోపానము 'ఎవరి ధర్మమును వారు ఆచరించుట'యని గ్రహించినచో తాను లోకమున ధన్యత జెందును. మానవుడు తన ధర్మమును తాను సక్రమముగా ఆచరించినచో అదియే స్వకీయ, పరకీయ ఉపకారముగా పరిణమించును. ధర్మమన దేశ సంప్రదాయ కర్మాచరణమేకాని వేరొండు కాదని మనము గ్రహించవలెను. మన ఆచారము లన్నింటియందును లోకోపకారమనెడి అంశము ఇమిడియున్నది. "అథాతో కర్మ జిజ్ఞాసా" అని మొదలిడి కర్మసిద్ధాంత మహారహస్యమంతయు విపులీకరించియున్నది. దానధర్మాదులొనర్చుట మహోత్తమ కార్యము కానీ దానియందును స్వార్థమిమిడియున్నదని తెలియవలెను. మానవుడు తానొనర్చిన కర్మయొక్క ఫలమును ఉత్తర జన్మానుభవము కొరకు దాచుకొనుట అని దాని అర్థము. ఇది శాస్త్రసమ్మతము. ఎవ రేకర్మనొనర్చినను 'స్వార్థమునకే కానీ ఇతరుల కొరకు కాదు' అన్నది స్పష్టమగుచున్నది. ఇది పరమ సత్యము. మొదటనే జీవుడు ఈ పరమ సత్యమును గ్రహింపజాలడు. ఏదో ఇతరులకు ఉపకారము చేయుచున్నానని గర్వించును. ఉప్పొంగును. విఱ్ఱవీగును. ఇది అజ్ఞానము యొక్క లక్షణము. అమాయకత్వముయొక్క ప్రోద్బలము. మాయయొక్క నాటకము.

వేదశాస్త్రములందు విధి నిషేధ ప్రణాళిక లను అహింస, భూతదయ, లోకోపకారము. దాన ధర్మాదుల గూర్చి చెప్పబడి యున్నది. దీనికే విద్యారణ్యులవారు భారతీయ విజ్ఞాన సారమని పేరుపెట్టిరి. విజ్ఞానమునది సర్వ విద్యలనుండి వెలువడిన సర్వశాస్త్రములను మథించి అందించిన సుధానిధి. అనగా నవ నీతము. సామాన్యముగా విజ్ఞానమనగా ఇదిబల్ల ఇది గుండు, ఇది ఇల్లు, ఇది ముల్లు అని చెప్పుట కాదు. ఇది సామాన్య జ్ఞానము. తరువాత ఈ పని వలన నాకును ఇతరులకును మేలు కలుగు నని తెలియుట సుజ్ఞానము. ఈ రెండును బుద్ధి భాగములు. ఇక సత్య అహింసాభూతదయాది గుణములతో జతపరచిన యెడల కలుగు హృదయ పరివర్తనమును విజ్ఞానము అన జెల్లును. ఇట్టి పరివర్తనము వలన మానవు నకును సృష్టితంత్రమునకును సృష్టికర్తకును గల సంబంధ బాంధవ్యమును గుర్తెరిగి సంఘ ర్షణ రాని విధానమవలంబించుట విజ్ఞానలక్షణ మనబడును. అజ్ఞానము దుఃఖమును విజ్ఞానము సుఖమును కలుగజేయును. 'ఇది విజ్ఞానమా? కాదా?' అను సంశయ విచ్ఛేదమునకు గీటు రాయి అంతః కరణము. ఏ వ్యవహారమైనను భౌతికమగునో, ఆధ్యాత్మికమగునో నిష్కళంక సుఖము ఇచ్చిన అదే విజ్ఞానము. విజ్ఞానమును కొలుచు కొలబద్ద ధర్మము. ధర్మమెంత అనుసరింపబడునో విజ్ఞానమంతగ పెరుగును. దీనికి దేశశాంతి, దేశసౌభాగ్యములు నిదర్శ నములు. ధర్మహీనత, విజ్ఞానరాహిత్యమును సూచించును. ధర్మాచరణము ననుసరించి యుగ బేధములు కలిగినవి. ధర్మము నీతి నియమ ములు సక్రమముగా నడచిన కాలమున ధర్మము నాలుగు పాదముల నడచెననియు అట్టిదే కృతయుగమనియును, పై నీతి నియ మాదులు కొద్దిగా సన్నగిల్లుటచేత ధర్మము మూడు పాదములతో నడచెననియు, అట్టి స్థితిని త్రేతాయుగమనియు, ధర్మము రెండు పాదములతోనే నడచుటచే, అనగా నీతి నిజా యితీలు మూడు భాగములు క్షీణించుటచే దీనిని ద్వాపరయుగమనియు, ఇక మూడుపాదములు వదలి కేవలము ఒకేపాదముతో ధర్మము నడచుటచే అనగా నీతి నిజాయితీలు పూర్తిగా కోల్పోవుటచేత దీనిని కలియుగమనియు తెలిపిరి. భారతీయుల విజ్ఞాన మంతయు ధర్మ తత్త్వమునందు కుదింపబడియున్నది. సృష్టి అసత్యమనియు అనగా మాయ అనియు, సంసారము దుఃఖ పూరితమనియు, శాస్త్రములు ఒక వంక తెలుపుచున్నను అవి ధర్మమును నిరసింపవు. ఆ పరమ సత్యమును తెలుపుటకు ధర్మమే మూలము. సృష్టి సత్యమని భావించు చున్న పురుషుని బుద్ధి ననుసరించి పురుషార్థ ములు నిర్ణయింపబడెను. అందులోను అనగా 'ధర్మ అర్థ కామ మోక్షములనే' చతుర్విధ పురుషార్థములందురు. ధర్మమునకే మొదటి స్థానమీయబడెను. కానీ ముఖ్య పురుషార్థము అనగా గమ్యము మోక్షము. ధర్మ యుక్తమగు అర్థకామాదులు తృప్తినిచ్చును.

శ్రేయోదాయకమగు మోక్షపదము మార్గదర్శి యగును. అటులే జీవుడు కామ మాయా స్వరూపుడగుటవలన పురుషార్థములలో ధర్మ మోక్షములు అతని దృష్టినుండి పోయినయెడల స్వస్వరూపములై మిగిలియున్న అర్థకామము లలో మునిగితేలుట విపరీతము కాదు. అహార భయ నిద్రాదులలో మానవుడు పశుసమానుడు. ధర్మ మోక్షములను భావములు పశుత్వ బుద్ధి నుండి మానవుని వేరు చేయును. అట్టి భావములు లేనియెడల మానవుడు జంతువునకు భిన్నుడు కాజాలడు. హిందూదేశౌన్నత్యము విజ్ఞానవైలక్షణ్యము. అది ఈ దేశజులచేతను ఇతర దేశజులచేతను ప్రశంసింపబడుచున్నది. సర్వదేశములందును దేవుడున్నాడను నమ్మకము కలదు. ధర్మ అధర్మ ప్రసక్తియుకలదు. నీతి నియమాదులు కూడా కలవు. భూతదయ అహింసాది గుణములు కూడా కలవు. సత్య అసత్యాది భేదములు కూడ కలవు. భారత దేశములో దేవాలయ రూపమున విరాజిల్లు నటువంటివే ఇతరదేశములలో చర్చిలు, మసీదులు, ప్రార్థనశాలలు, మందిరములు, వివిధరూప నామములతోనున్నవి. కానీ భారత దేశము ఇతర దేశములకన్న విలక్షణమైన స్థాయిని అందుకొన్నది. మతములందు సర్వ మతములు ఒక్కటే అని తెలుపుచున్నది భారతదేశము. తదంగములలో భేదమున్నను సర్వమతములు ఒక్క సత్యమునే తెలుపు చున్నవి. భారతీయుల సిద్ధాంతము దైవ ప్రార్థనలకు ఒక్క రాతిని ఏర్పరచుకొన్నది. మరొకరు లోహములను మరొకరు కఱ్ఱను ఆధారము చేసుకొనుచున్నారు. దైవప్రార్థన అన్ని దేశములందును జరుగుచున్నది. ఒకరు ప్రార్థనకు తూర్పు ముఖము పెట్టిన, వేరొకరు పడమర ముఖమును పెట్టును గానీ ప్రార్థ నాంశము ఒక్కటే అని భారతదేశమున నిర్ధా రితమైయున్నది. ఎవరి యెవరి మతగ్రంథ సిద్ధాంతములు వారలకు గలవు. ఇట్టితరి భారతీయులుగానీ ఇతర మతములవారు కానీ చెప్పునట్టి విలక్షణత యెంతయున్నదో యోచించవచ్చును. భారతదేశములో దేవుని "రావేమిరా, రక్షింపవేమిరా, వినవేలరా నా మొర" అని యేక వచన సంబోధన చేతురు. ఇతర మతములలోని వారు ఈ విధముగా సంబోధించరు. ఎవరు ఏ విధంగా భావింతురో వారు ఆ విధముగానే మారుదురు. నేను దేవుడను అనినచో వానిని దేవునిగానే భావిం చును కానీ నేను రాజును అనినచో ఆ దేశపు రాజు వానిని పిచ్చివానిగ భావించును. లేక శిరశ్ఛేదనము చేయును. ఈ విధముగా దేవుడు చేయడు. ఇదియే భారతీయ విజ్ఞానచరమ సిద్ధాంతము.

కేవలము బుద్ధినే అనుసరించి సలిపిన విషయ విచారణ వలన తెల్పబడు సిద్ధాంతములు పూర్తి సత్యములు కాజాలవు. విషయములకు ఆరు కోణములు కలవు. అందు ఒక ప్రక్క మాత్రమే బుద్ధి చూడగలదు. వేదచోదిత కర్మానుష్ఠానమువలన లెస్సగా సంస్కరింప

బడిన బుద్ధి ఇరుప్రక్కలకు చూడ నేర్చును. అట్లు సంస్కరింపబడని బుద్ధియొక్క చూపు భౌతికమైన సరిహద్దుల మధ్య బంధింపబడి యుండును. అందువలన బుద్ధి సాధించి తెల్పు నట్టి సిద్ధాంతములు విధిగ ఖండ సత్యములై యుండును. సంస్కరింపబడిన బుద్ధి యొక్క చూపు పూర్ణత్వమొందును. అట్టి చూపునకు విషయసత్యత్వ మఖండముగా నుండును. ఇతర మత సిద్ధాంతములు బుద్ధి పరిమితిలోనివి. తమ తమ సిద్ధాంతములు మాత్రమే సత్యమనును. మానవబుద్ధి స్వతంత్రముగ ప్రసరింపగలుగు నట్టి అవధిని చూపునట్టి దివ్యజ్యోతులు శాస్త్రములని తెలుపునవి భారతీయసిద్ధాంతములు.

శ్రీవారి దివ్యోపన్యాసము



# యోగత్రయము

లోకమున మోక్షమును పొందుటకు మూడు యోగములు అవలంబింప బడుచున్నవి. మోక్షమనగా బంధమునుండి విముక్తిని పొందుట. ఆనంద స్వరూపుడైన జీవుడు అహంకార బంధమువలన తాను ఆనంద స్వరూపుడనని గుర్తించుకొన లేకున్నాడు. ఒక దేహము నందలి, జీవుని స్థితియే ఇట్లున్నపుడు అతడు దేవుని విశ్వాంతర్యామిత్వమును గుర్తించుట యెట్లు?

జీవుడు తొలుదొల్తగా తనను తాను దేవుని అంశమని గుర్తించుకొన గలిగినపుడు ఇతర జీవులనుకూడ దేవుని అంశములుగా, తనకు రూపాంతరములుగా భావింప గలుగును. దీని సిద్ధికై యేర్పడిన సాధనములే కర్మ, భక్తి, జ్ఞాన, యోగములు. ఇందు కర్మయోగము, కార్యాచరణమునకు సంబంధించినది అనియు, తక్కినవి కర్మ రాహిత్యమునకు సంబంధించిన వనియు కొందరు భావింతురు. కాని మూడును కర్తవ్యాచరణకు సంబంధించినవే. ఈ యోగత్రయము యొక్క లక్షణ సామ్యమును తెలిసికొనుటకు నిత్య జీవితము లోనే చక్కని లక్ష్యము కలదు. ఒక బాలుడు లేదా బాలిక తన కొరకై ఇతరులచేత పనులు చేయించు కొనుట కర్మయోగము. ఇందు తన కొరకై ఇతరులు కర్మచేయు చున్నారన్న అహంకారము వలన బంధము కలుగును.

ఆ బాలుడు లేక బాలిక యుక్తవయస్సు వచ్చి పెండ్లి చేసికొని భార్యకు గాని, భర్తకు గాని, పిల్లలకు గాని అత్తమామలకు గాని సేవ చేయుట భక్తి యోగము. ఇందు "నా" యొక్క బంధువులు అను మమకార బంధమేర్పడును. మరి కొందరు దేవుని విగ్రహమును పూజించి, దేవుని పూజించితిమని భ్రమపడుచు కర్మాచరణముమాని భక్తియోగము అనుష్ఠించుచున్నామని అనకొందురు. కాని వ్యక్తి రూపమునను, విగ్రహ రూపమునను ఉన్న మరి యొకని కొరకై కర్మ చేయుటయే భక్తి యోగము.

తన కుటుంబము పెరిగి పెద్దదై తాను తాతయై తన కుమారునకు చేసినట్లే తన మనుమలకు కూడ

పనులు చేసి పెట్టుటయే జ్ఞానయోగము. "ఈ సృష్టి పద్ధతి ఇది" అని తెలిసికొని కర్మలను ఆచరించుటయే జ్ఞానయోగము. ఇది తెలియక కొందరు జ్ఞానము కలిగినదని కర్మలను విడిచి పెట్టుదురు." అన్నము తిన్నచో ఆకలి తీరును" అను జ్ఞానము మనకు కలిగినంత మాత్రమున అన్నము తినకుండ ఆకలి తీరునా?

ఈ విధముగ ఈ మూడు యోగములందును కర్మాచరణము తప్పని సరియైనది. చిన్న వయసున స్వార్థ దృష్టితో చేయబడు కర్మయే కర్మయోగము. యౌవనమున పరార్థ దృష్టితో కర్మ చేయుటయే భక్తి యోగము. వార్థక్యమున పరమార్థ దృష్టితో కర్మ చేయుటయే జ్ఞానయోగము. ఈ విధముగ స్వార్థము, పరార్థము, పరమార్థములతో కూడిన కర్తవ్యా చరణమే కర్మ, భక్తి, జ్ఞానయోగములు కాగా, కౌమార, యౌవన, వార్థక్య జీవితము దీనికి లక్ష్యమగుచున్నది.

ఈ మూడు యోగములకు లక్ష్య గ్రంథములుగానే భారతీయ ప్రధాన సాహిత్య గ్రంథములయిన భారత, భాగవత, రామాయణములు రచింపబడినవి. భారతము కర్మయోగమును నిరూపించునది. భాగవతము భక్తి యోగమును నిరూపించునది. రామాయణము, జ్ఞాన యోగమును నిరూపించునది. వీని రచనా క్రమమున, రచనా విధానమున సృష్టి రహస్యము బోధించు ఒక చమత్కార మిమిడియున్నది. భారతమున పాండవులు శ్రీ కృష్ణుడు తమకు సహాయముగా నున్నాడని భావింతురు. అట్లే దుర్యోధనాది కౌరవులు అనేక రాజులు తమకు సహాయులుగా నున్నారని తలంచిరి. ఈ విధముగ స్వార్థము కొరకై కర్మ కొనసాగు చున్నదనుకొనుట కర్మయోగము. ఇది తెలియనిచో కర్మ బంధము అగును. అట్లే భాగవతమున పూతనాది రాక్షసులు, కంసాది దుష్టరాజులు, కుచేలాది భక్తులు, నారదాది మహర్షులు, గోపికలు మున్నగు స్త్రీలు పరమాత్మయైన శ్రీ కృష్ణునికై తాము సేవ చేయు చున్నామని భావించిరి. ఇట్లు పరార్థమునకు కర్మచేయుటయే భక్తియోగము. ఇది తెలియనిచో భక్తి బంధమగును. కావుననే చాల మంది సర్వాంత ర్యామియైన శ్రీ కృష్ణుని అందరియందు చూడ లేక శ్రీ కృష్ణుని విగ్రహము మాత్రమే శ్రీ కృష్ణ వ్యక్తిగా భ్రమపడి భక్తిని బంధముగా చేసుకొను చున్నారు. కాని శ్రీ కృష్ణ విగ్రహమునకు పూలమాల వేయుట భార్య కురులలో విరులు ముడుచుట వంటి కర్మాచరణమే అగును. అట్లే శ్రీ కృష్ణునకు నైవేద్యము పెట్టుట పిల్లలకు తిండిపెట్టుటవలె కర్మాచరణమే యగును. అందువలన భార్యను, పిల్లలను పోషించుట మాని శ్రీ కృష్ణవిగ్రహమును పూజించుచు కర్మ బంధమును విడిచి భక్తి యోగమును అవలంభించితి ననుకొనుట ఎడమచేయి తీసి పురచేయి పెట్టుట వంటిదే. కనుక శ్రీ కృష్ణునకు వలెనే భార్యను, పిల్లలకును పరార్థదృష్టితో సేవా ధర్మముగ కర్మ చేయవలెననుటయే భాగవతోపదేశము. ఇదియే భక్తి యోగము.

రామాయణము నందు రాముడు వనవాసమునకు పోవుట, మాయలేడిని వేటాడ బోవుట తన కొరకు గాని (స్వార్థము) దశరథుని కొరకు సీతకొరకు గాని (పరార్థము) కావు. శ్రీమన్నారాయణుడైన తాను జ్ఞాన స్వరూపుడు కనుక అజ్ఞానులైన రాక్షసులను సంహరించి (మాయను తొలగించి) వారిని కూడ జ్ఞానస్వరూపులుగా చేసి తన విశ్వాంతర్యామిత్వమును నిలుపు కొనుట కొరకే రాముని ప్రవర్తన మంతయు నుద్దేశింప బడినది. ఈ విధముగ సర్వము తెలిసి కర్మాచరణ చేయుటయే జ్ఞాన యోగము శ్రీరాముడు జ్ఞానయోగి. ఇక్కడ చమత్కార మేమనగా శ్రీరాముడు తనకు సర్వము తెలిసినను తెలియనట్లే ఉదాసీనుడై సర్వమును నడిపించును. ఇతరులను నడిపించువాడు తానును నడుచునట్లు తన కథ నడిపించుటకై తానును

తన కథలో ఒక పాత్రయగును. ఇది తెలియుటయే జ్ఞానయోగము. తెలియనిచో ఇది జ్ఞానబంధము. రావణునిది జ్ఞాన బంధము. రామునకు సర్వము తెలిసినచో మాయలేడి వేటబడి యేల పోవును ? అని కొందరు ప్రశ్నింతురు. కర్మప్రధానుడైన జ్ఞాన యోగి జ్ఞానమును ప్రకటింపడనుట లోక సహజము. మనను అన్నము తినునపుడు "అన్నము తినినచో ఆకలి తీరును" అని అనుకొని తిందుమా ? శ్రీరామునకు రావణుడు సీతను ఎత్తుకొని పోవునను సంగతి తెలియును. కాని తెలిసినట్లు చెప్పడు. (విశ్వామిత్రుని అధ్యాత్మరామాయణమున ఈ విషయము స్పష్టముగా చెప్పబడినది).

ఇట్లైనచో భారత, భాగవత, రామాయణ క్రమము గాక రామాయణము ఆది కావ్యము ఎట్లైనది ? అను సందేహము ఉదయించును. దీని కొకటే సమాధానము. జీవులకు సిద్ధి చివరిది కాగా దేవునికి సిద్ధియే మొదటిది. మనమందరము జ్ఞానమునుండి అజ్ఞానమునకు అవరోహించితిమి కనుక అజ్ఞానమునుండి జ్ఞానమునకు ఆరోహింపవలసి యున్నది. దేవునకు జ్ఞానమునుండి అజ్ఞానమునకు అవతరించుట లీలయే గాని సహజము కాదు. కనుక ఆయనకు జ్ఞానమే మొదటిది. ఆయన సంకల్పజ్ఞానమే సృష్టి కర్మకు మూలము కదా. కనుక శ్రీరామునకు రామాయణము, దేవునకు సృష్టి వంటిది. కనుక శ్రీ మద్రామాయణము ఆది కావ్యమైనది. భారత, భాగవతములు సృష్టిలోని జీవులకు సంబంధించినవి. కనుక తరువాతి రచనలు అయినవి. కాని ఆయా గ్రంథములను చదువు క్రమమున భారత, భాగవత, రామాయణ క్రమము పాటించినచో జ్ఞానయోగ సిద్ధిచేత కర్మ, భక్తి, జ్ఞానముల పరిణామము జీవుని ఆరోహణము అనుభవ సిద్ధముగా, సృష్టి ధర్మముగా అనుభూతి కలుగును. జీవితమునందు జ్ఞాన యోగముచే సృష్టి సర్గము చేసికొనుట, కర్మయోగముచే భక్తి యోగముచే సృష్టిని ఆనందించుట జరుగును. ఇది యోగత్రయ వికాసరహస్యము.

—భారతీ ప్రియ



# 'నీవే తల్లియు, [illegible].

గత సంవత్సరం సమ్మర్ కోర్స్ ముగియగానే పుట్టపర్తి వెళ్లాం. అక్కడ స్వామి ఒక విద్యార్థిని 'నీ తండ్రీ తల్లీ ఎక్కడ ఉన్నాడు / ఉన్నది ?' అనే అర్థం వచ్చే ప్రశ్నను (**Where is your father and mother**) అని అడిగారు. ఆ వాక్యం వినేసరికి నేను నిశ్చేష్టుణ్ణయ్యాను. అలా కావటానికి రెండు కారణాలు ఉన్నాయి.

అందులో మొదటి కారణం:– భగవాన్ సర్వజ్ఞుడూ సర్వాంతర్యామీ అయి కూడా ఇటువంటి ప్రశ్నలు వేస్తారా ? ఈ జగత్తులో మూరుమూలలో ఉన్న ప్రతి గడ్డిపోచ కదలిక గూడా వారికి తెలిసి ఉండాలి కదా ? మరి ఏమీ తెలియనట్లు ఎందుకీ నాటక మాడటం ? నా యెఱుకలో ఇది ఒక్కటే కాదు, ఇటువంటి సంఘటన లెన్నో జరిగాయి. నాకూ, నా తల్లిదండ్రులకూ

దర్శనాన్ని ప్రసాదించినప్పుడు కూడా ఏమీ తెలియనట్లు మా అమ్మను 'నీ వెవరవు ?' (Who are you) అని అడిగారు స్వామి. ఆ ప్రశ్న వినగానే మొదట మా అమ్మ ఆశ్చర్యపోయింది. కాని, తరువాత ఆ మాటలను మననం చేసుకుంటే ఆ ప్రశ్న ఆమె ఆత్మ జ్ఞానాన్ని సంపాదించు కొనటానికి ప్రేరకంగా అడిగినట్లు తెలిసికొన్నది.

ఇక రెండవ కారణం-వారు మాట్లాడిన వాక్యంలో దొరలిన వ్యాకరణ దోషం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. నాకు తెలిసిన వ్యాకరణ పరిజ్ఞానాన్ని బట్టి ఆప్రశ్న 'నీ తండ్రి, తల్లీ ఎక్కడ ఉన్నారు?' ("where are your father and mother") అని ఉండాలి. ఒకటికి మించిన నామవాచకాలు గాని, సర్వనామములుగానీ కర్తగా ఉంటే వాక్యంలో క్రియ బహువచనంలోనే ఉండాలి. అందులో అనుమానమే లేదు. బడికి పోయే ప్రతివిద్యార్థికీ ఈ ప్రాథమికమైన వ్యాకరణనియమం తెలిసేఉంటుంది.

కాని......భగవాన్ ఇటువంటి వ్యాకరణదోషం చేస్తారా ? వారు సర్వజ్ఞులు; దోషరహితులు. అందువలన భగవాన్ ఆటువంటి తప్పు చేయటానికే వీల్లేదు. ఒకవేళ భగవానుడే ప్రమాదానికి పాలైతే-గ్రహసంచారం ఆగిపోతుంది: వాయుప్రసారం నిలిచిపోతుంది; సూర్యోదయం స్తంభించిపోతుంది. తప్పు చేయటం మానవలక్షణం; భగవల్లక్షణం కాదు. భగవంతుడు మనం చేసిన తప్పులను క్షమిస్తాడు.

భగవాన్ సర్వశాస్త్రనియమాల కతీతుడని మనకు తెలుసు. కాని, వారు శాస్త్రాన్ని మన్నిస్తారు. వారు భాషాపరిధుల కతీతులని మనకు తెలుసు. 'మనకు ఒకే ఒక్క భాష ఉన్నది; అది హృదయాలు మాట్లాడే భాష" అని స్వామి ఎప్పుడూ చెపుతుంటారు. వారు తెలుగులో వ్యవహరించటంవల్ల నిజంగా ఆభాష ఎంతో అదృష్టం చేసుకొన్నదని చెప్పాలి. కాని, ఎప్పుడైనా ప్రసంగాల్లో గాని వారినోట మరోభాషలో ఒకటి రెండు వాక్యాలు దొరలినా అవి అందంగానూ, ఉత్తేజకంగాను, అనంత జ్ఞాన దీపికలుగాను ఉండి వెలుగు నింపుకుంటాయి.

కాని, భగవాన్ ఒకసామాన్యవాక్యంలో వ్యాకరణ దోషం చేయగలగటానికి వీలుందా ? అది అసంభవమని నాకు గాఢమైన విశ్వాసముంది. కాని, మరోవైపు నా వ్యాకరణ పరిజ్ఞానం మీదకూడా గట్టి నమ్మకముంది. దీనితో నామనస్సు ఆందోళనతో కూడుకున్న సంఘర్షణకు గురిఅయింది. నావ్యాకరణ గ్రంథాన్ని ఒకసారి మళ్లీ చూద్దామా ? అని అనిపించింది. వ్యాకరణం ఈవాక్యదోషాన్ని నిరూపిస్తే ఏంకావాలి ? అది నిజానికొక ప్రళయమే అవుతుంది. అవతారమూర్తి భగవాన్ మనకు ఏకైక ఆశాకిరణం ! ఆయన కూడా తప్పు చేయగలిగితే-ఇక మనమీ ప్రపంచంలో దేన్ని నమ్ముకొని బ్రతకాలి ?

ఈ మథన వేదనగా మారింది; వేదన బాధగా పరిణమించింది. నేనిక దాన్ని తట్టుకోలేక పోయాను. నా అనుమానాన్ని ఖాయం చేసుకోవటానికి నా వ్యాకరణగ్రంథాన్ని చూడాలని నిశ్చయించుకున్నాను......'హే భగవాన్ ! ఈ దోషభూయిష్ఠమైన వాక్యాన్ని మీ రుచ్చరిస్తున్నప్పుడు నేను వినకుండా ఉంటే ఎంత బాగుండేది?' అని లోలోన కువకువలాడాను. ఆగ్రంథం నేను శంకించినట్లుగానే దోషాన్ని ధ్రువీకరించింది. అంతేకాదు-భగవాన్ పలికిన వాక్యమే ఆగ్రంథంలో ఉదాహరణంగా ఇవ్వబడింది. దానితో నాకు మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లైంది.

నేను ఎంత అనుమానించానో అంతానిజమైంది. భగవంతుడు వేదాలను నిర్మించాడు; సకలశాస్త్రాలూ ఆయన ముఖకమలంనుండి సముద్భవించాయి.

ఆయన' కవీనాం కవిః; శబ్దశాస్త్రశిరోమణి. ఆమహాత్ముని దయ లేక పోతే నేనొక మాటనైనా పలక లేనే? అంతటి అభగవంతుడే తప్పు చేశాడా?.........

కాని, అవ్యాకరణ గ్రంథాని కొక అనుబంధ ప్రకరణముంది. దాన్ని చదివేసరికి నాకళ్లలో నీళ్లు తిరిగాయి "పైన చెప్పిన సూత్రానికి ఒక అపవాదం (Exception) ఉంది. ఒక వాక్యంలో రెండుగాని, అంతకు మించిగాని నామవాచకాలు కర్తగా ఉన్నా, అవి ఒకేవ్యక్తిని నిర్దేశిస్తుంటే క్రియ ఏకవచనంలో ఉండవచ్చు" నని. దానికి ఉదాహరణం; 'నాతల్లీ, తండ్రీ, అన్నీ ఆతడే "-ఇంగ్లీషులో-He is my mother, father and all".

ఓహో ! భగవాన్ ! నీవేమిటి ? అసలు తప్పుచేయట మేమిటి ?' అని అప్రయత్నంగా నా మనస్సు ఆనందాన్ని ప్రకటించింది. స్వామి ఆవిద్యార్థితో మాట్లాడినప్పుడు కావాలనే ఆ ఏకవచన క్రియను ప్రయోగించారావాక్యంలో. వారడిగింది అతని భౌతిక మైన తల్లిదండ్రులను గురించికాదు "నీవే తల్లియు దండ్రియు నీవే నాతోడు నీడ..... 'అనే అంతరార్థాన్ని అందుకోవటానికి ఆలోచన రేకెత్తింపచేసే ప్రశ్నఅది. నిజంగా భగవాన్ ఒక్కడే అతని తల్లీతండ్రీ సర్వమూ.

శంకర్
తిరువనంతపురం
(సమ్మర్ కోర్సు విద్యార్థి)



# భగవద్గీతలో ప్రతి అక్షరం దివ్య మంత్రం

అల్లా యంచు మహమ్మదీయులు
ఎహోవాయంచునున్ క్రైస్తవుల్
పుల్లాబ్జాక్షుడంటచు వైష్ణవులు
శంభోయంచు శైవులు సేవింపగా
ప్రహ్లాదంబున గొల్వ, అందరికి సంప
ల్లాభంబు లొసగి రక్షించు
పరమాత్ముండొక్కడెయంచు భావింపుడీ !

జనులు వారివారి భక్తి ప్రపత్తుల ననుసరించి భగవంతునకు భిన్న భిన్న రూపాలను నామాలను నిర్ణయించుకొనుచున్నారు. కాని, సర్వ మతాలకు సర్వ సంప్రదాయలకు అనుగుణమైన, అంగీకార యోగ్యమైన స్వరూప స్వభావము నేడు లోకంలో అత్యవసరం.

గీతాచార్యుడు సర్వమత శ్రేయస్సును అనుసరించి సంప్రదాయాలను పోషింప గోరి ఏకత్వమైన దివ్యత్వాన్ని అర్జునునకు ప్రబోధించాడు. సకల మతాలకు సమమైన ఒక్క రూపాన్ని నిరూపిస్తు వచ్చాడు.

### అక్షరమే రూపం

అక్షరం రూపం. ఓంకారం నామం. ఆధ్యాత్మికమే దీని భావం. ఇది సర్వమానవ సమన్వయ మైన సత్యస్వరూపం.

స్వభావం అంటే త్రిగుణములతో కూడినది కాదు, ఇది దివ్య ప్రకృతి. ఈ దివ్యప్రకృతి నుండి సృష్టి ఆవిర్భవిస్తున్నది. ఏకాత్మగల దివ్యాత్మ స్వభావం అనేకత్వంలో అవిర్భవిస్తున్నది.

**ఒకటి అనే అంకెలో అన్ని అంకెలు వున్నాయి.**

సంఖ్యాశాస్త్రంలో 1, 2, 3, 4 అని అంకెలు చెప్తారు. ఒకటికంటే 3, 5, 7 భిన్నంగా కని పిస్తున్నాయి. దీని అంతరార్థాన్ని గుర్తించాలి. ఇవి ఒకటికంటే భిన్నమైనవి కావు. ఒకటి అనే అంకెకు మిగిలిన అంకెలు రూపాంతరాలు. నాలుగులో నాలుగు ఒకట్లు వున్నాయి. 1 + 1 + 1 + 1 = 4 నాలుగుకు ఒకటి చేరిస్తే 5 అవుతుంది. ఇక్కడ అంకెలు క్షీణించడం, అభివృద్ధి చెందడం జరుగుతున్నది. కాని ఒకటి అనే అంకెకు మాత్రం ఎలాంటి మార్పులేదు.

ఇదేవిధంగా ఏకం కాగల దివ్య ప్రకృతి అనేక స్వరూపాలను ధరిస్తున్నది. ఏకాత్మ క్షీణించదు. అభివృద్ధి చెందదు. అందుకే దానిని అక్షరం అన్నారు.

ఈజగత్తు క్షయశీలమైనది. దైవత్వం అంటే నాశరహితం. ఈ సత్యాన్ని తెలిపేందుకు అక్షరాన్ని వివరించారు. ప్రతి మతంవారు, సంప్రదాయంవారు భగవంతుడు అక్షరస్వరూపుడని, నాశరహితుడని అంగీకరించక తప్పదు. సర్వమతాలవారు అక్షర స్వరూపాన్ని అంగీకరిస్తారు. సర్వమత సత్యమైనది అక్షరం ఒక్కటే భేదభావాలు కేవలం అభిమానంతో ఏర్పడినవే. అక్షరంలో ఓంకారం అంకెలలో ఒకటి ప్రధాన ఆకారాలు.

**బ్రహ్మవిద్య**

ఓంకార రూపాంతరాలు ఇతర అక్షరాలు. ఇట్టి పవిత్ర అక్షర పరబ్రహ్మతత్త్వం తెలుపగోరే విద్యనే 'బ్రహ్మవిద్య' అంటారు. అందుకే భగవద్గీతలో ఎనిమిదవ అధ్యాయమునకు 'అక్షర పరబ్రహ్మ యోగం' అన్నారు.

కూటికోసం లౌకిక విద్యలు అవసరమే. భౌతిక సుఖాలు లేకుంటే ఆధ్యాత్మిక సుఖాలను ఆశించలేం. భౌతిక విద్యలతో పాటు ఆధ్యాత్మిక విద్యలు కూడ అతి ప్రధానం. అన్ని విద్యలు నదుల వంటివి. ఆధ్యాత్మిక విద్య సముద్రం వంటిది.

గుణాతీతతత్త్వమే అక్షర స్వరూపం. ఇది నిర్గుణ మైనది. నిరంజనమైనది. భగవద్గీతలో ప్రతి అక్షరం పరమాత్మను ప్రబోధించేదే. ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క దివ్యమంత్రం.

శంకరుల వారు
"భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్‌కరణే"

అన్నారు. ఎంత పాండిత్యమున్నా జీవితంలో అది మనలను రక్షించలేదు. ఆధ్యాత్మిక విద్యయే అసలైన విద్య.

**పండితుడు—పడవవాడు**

ఒక పండితుడు వేదవేదాంగాలను అభ్యసించాడు. పొరుగూరికి వెళుతూ మధ్యలో నదిలో పడవలో ప్రయాణము చేస్తున్నాడు. ఆ పండితుడు పడవవాడిని నీకు టైం చూడడం వచ్చా ? పేపరు చదువగలవా ? పాట పాడగలవా ? అని ప్రశ్నించాడు. స్వామీ! నేను ఏమీ చదువుకోలేదు. నాకు ఇవేవీ తెలియవు అన్నాడట.

ఇంతలో పెద్దగాలి వీచింది. గాలికి పడవ ఇటూ అటూ వూగిందట. అప్పుడు పడవవాడు స్వామీ!

తమరికి ఈతవచ్చా ? అని అడిగాడట. అయ్యయ్యో ! నాకు ఈతరాదు ! అన్నాడట పండితుడు. అయ్యో, మీకు ఈతరాకుంటే మీ జీవితం గంగపాలౌతుంది అన్నాడట.

సంసారసాగరంలో ప్రయాణముచేసే ప్రతివ్యక్తికి దివ్యభావమనే ఈత అవసరం. దివ్యమైన భగవత్తత్త్వాన్ని తెలుసుకోవాలి. ఏమతమువారైనా ఓంకారం ఉచ్చరించక తప్పదు. కానీ ఒక్కొక్క మతంవారు ఒక్కొక్క ఆరాధనను అంగీకరించారు. హిందువుల భగవంతుని ముస్లింలు అంగీకరించక పోవచ్చు. ముస్లింల ఆరాధనను క్రిస్టియనులు అంగీకరించక పోవచ్చు. కాని సకలమతములవారు 'అక్షరం' అనే ఆధారాన్ని అంగీకరించక తప్పదు. అక్షరం నాశ రహితం, మార్పుచెందనిది. భగవద్గీత ఎనిమిదవ అధ్యాయంలో ఈ పవిత్ర అక్షర స్వరూపాన్ని కృష్ణుడు అర్జునునకు తెలిపాడు.

## అధ్యాయాల విభజన మన తృప్తికి మాత్రమే

భగవద్గీతలో 1, 2, 3, అని అధ్యాయాలను మన తృప్తికై ఏర్పాటు చేసుకొన్నాము. ఈ అధ్యాయాలను అనుసరిస్తున్న కొద్దీ దివ్యభావాలు ఆవిర్భవిస్తాయి. మానవత్వ దృష్టిలో భగవద్గీత ఒకే అధ్యాయం. మునువు చెప్పినట్లు దేహాన్ని పాదములు, తొడలు, శిరస్సు, అని విభజించినా హృదయం మాత్రం ఒక్కటే. దివ్యప్రకృతి కూడా దివ్య ఆత్మతత్త్వాన్ని వివరిస్తున్నది.

సాధారణ ప్రకృతి, దివ్య ప్రకృతి, సాధారణ మనుస్సు, దివ్య మనస్సు అన్న విభజనతో దివ్యత్వాన్ని నిరూపిస్తున్నది. దివ్యప్రకృతి సర్వత్రా వ్యాపించినది.

## విశ్వం పెద్ద అంకె

ఈ విశ్వం ఒక పెద్ద అంకెవంటిది. ఇదియే సమష్టి స్వరూపం. ఒకటవ నంబరు విశ్వంలో సమష్టి స్వరూపంతో కూడి ఉంటుంది. ఒకటవ నంబరు అన్ని అంకెలలో ఉన్నట్లు ఒక్క అక్షరం సర్వత్రా వ్యాపించిందని గుర్తించాలి. అప్పుడే అనేకత్వంలోని ఏకత్వాన్ని గుర్తించవచ్చు. మనం దేహ భ్రాంతిని విడిచిపెట్టాలి. బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవాలి. అక్షరంలో చేరిపోవాలి. అందుకే 'అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ' అన్నారు.

ఈ దేహం ఉపాధి. అంతేకాని, సాక్షీ భూతం కాదు. దేహ భ్రాంతితో కర్మలు ఆచరించక తప్పదు. కానీ ఈ భ్రాంతిని ఆత్మతో లక్ష్యంగా చేసుకోవాలి, దేహం పాంచభౌతికం. భవసాగర మీదలేని కంప రోగముల కొంప ఈ దేహం. అందుకే ఓ మనసా ! హరిపాదమును ఆశ్రయించు. ఈ దేహమే దేవదేవుడు. నీవు శరీరం కాదు. శరీరివి.

నాశరహితమైన, దివ్యమైన ఆత్మతత్త్వమే అక్షర స్వరూపం.

## కామధేనువుఉంటే ఆవును ఎందుకు కొనాలి ?

కోరిన ఫలమిచ్చే కామధేనువు ఉంటే ఆవును ఎందుకు కొనాలి ? కల్పవృక్షముంటే పెరటిలో గల పండ్లవృక్షంపై మోజు ఎందుకు ? దివ్యతత్త్వమైన ఆత్మతత్త్వం మనలోనే ఉండగా, దానిని విస్మరించి భ్రాంతితో వ్యామోహాలకు, మమకారాలకు లోనవుతున్నాం.

అర్జునా ! అక్షర స్వరూపాన్ని అనుసరించు. ఓంకారాన్ని స్మరించు. రూపనామ భావములతో కూడిన దివ్యత్వంపై జీవితాన్ని అర్పణం చేయి. సవ్యసాచీ ! నీవు నిమిత్తమాత్రుడవు. పాత్ర ఉంటే జలం వుంటుంది. పాత్ర లేకుంటే జలం వుండదు. దేహమనే పాత్రలో గీతారసాన్ని నింపాలి. ఘటములో విడచిన ఆకాశం మహాకాశంలో లీనమైనట్లు బుద్ధి, మనస్సు విడిస్తే దివ్యత్వంలో లీనమవుతావు.

అర్జునా ! ఈ అక్షర స్వరూపాన్ని గుర్తించి దివ్యత్వాన్ని తెలుసుకో అని కృష్ణుడు ప్రబోధించాడు. విద్యార్థులు భగద్గీత సారాన్ని, ప్రబోధాలను ఆచరించి అనుసరించాలె.

శ్రీవారి దివ్యోపన్యాసము
వేసవితరగతులలో
(11-6-79)

# సర్వమత సమ్మతం ఓంకార స్వరూపం

నీటియందుపుట్టి నీటనే తేలుచు
నీటియందడంగు నీటిబుడగ
నరుడు బుద్బుదంబు, నారాయణుడు నీరు
వినుము భారతీయ వీరసుతుడ.

అన్ని మతాలవారు అభ్యంతరం లేకుండా అంగీకరించే ఆత్మస్వరూపం అక్షర స్వరూపం. అన్ని సంప్రదాయాలకు ఆదరణయోగ్యమైన స్వరూపం అక్షర స్వరూపం. నిర్గుణత్వాన్ని, నిరంజనత్వాన్ని నిరూపించేందుకు అక్షరం ప్రధానం.

దీని నామమే ఓంకారం. 'ఓం' సర్వమతాలసారం. సమస్తశాస్త్రాలకు మూలం. సర్వధర్మాలకు ఇదియే కీలకమైనది. అకార, ఉకార, మకారముల అంతరార్థంతో, కూడుకున్నది. సర్వ అక్షరములకు చైతన్యాన్ని కలిగించేది ఉపనిషత్తులు, ఇతిహాసాలు, పురాణాలు వివరించే తత్త్వం ఓంకారం, ఇది శబ్ద బ్రహ్మం. చరాచరం. జ్యోతిర్మయం. వాఙ్మయం. పరాత్పరమయం. నిత్యానందం.

జగత్తు అక్షరం నుండి ఆవిర్భవిస్తున్నది. అక్షరంలో క్షరం ఉన్నది. క్షరంలో అక్షరం లేదు. కల్పితమైన ఈ జగత్తులో కూడా అక్షర స్వరూపం ఉన్నది.

మట్టిలో కుండలు లేవు. కుండలు కల్పితములు. కాని కుండలలో కూడా మట్టివున్నది. అక్షరంలో క్షరం లీనమై ఉన్నది. నీటిబుడగ కల్పితం. కాని బుడగలో కూడా నీరు ఉన్నది. శాశ్వత అశాశ్వతములలో అక్షరం లీనమై ఉన్నది.

## ఓంకార ప్రాశస్త్యం

ఇట్టి దివ్యమైన, పవిత్రమైన అక్షర తత్త్వాన్ని నిరూపించేందుకు ఓంకారం ఆధారం. అకార, ఉకార మకారములను ఒక నియమాన్ని అనుసరించి ఉచ్చరించాలి. అకారాన్ని విశ్వుడని (జాగ్రత్ స్వరూపం) ఉకారాన్ని (స్వప్న) తైజసమని, సుషుప్తి (మకారం) ప్రాజ్ఞమని. ఇదియే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల తత్త్వమని వివరిస్తారు. ఇట్టి ఓంకారం ఆధారంగానే జీవితాన్ని సార్థకం చేసుకున్నారు మహాయోగులు.

రామాయణంలో అకార ఉకార మకారములను లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగా వివరిస్తున్నారు. ఈ మూడు శబ్దాల సమ్మిశితమే ఓంకారమని (రాముడని) నిరూపించారు. వేదాల స్వరూపమైన, పవిత్రమైన, ఓంకార ప్రత్యేకతను భగద్గీతలో కృష్ణుడు నిరూపించాడు.

'తస్య వాచకః ప్రణవః" అన్నాడు పతంజలి మహర్షి. వేదాలలో ప్రణవం నేనే అన్నాడు కృష్ణుడు. భగవంతునకు ప్రణవం అనేది సార్థకనామం. క్రైస్తవులు ప్రార్థనలో 'ఆమెన్' అంటారు. ఈ పదంకూడా ఓంకార రూపమే. సర్వ మానవులు ఈ ప్రణవశబ్దాన్ని ఉచ్చరించవచ్చు.

## జీవన నదిలో కోరికలు నీరు

ఆశ పెద్దనది వంటిది. కోరికలు నీరు. ఊహాలే అలలు. కాంక్షలు మొసళ్లు. భ్రాంతులు సుడిగుండాలు.

ఈ భయంకర నదిని దాటే సాహసం, ధైర్యం ఒక్క యోగికే ఉంది. అందుకే పతంజలి 'యోగః. చిత్తవృత్తి నిరోధః' అన్నాడు.

సామాన్య జగత్తులో నదులు పెరగడం తరగడం, ఎండిపోవడం వుంటుంది. కానీ ఈ జీవనదికి కోరికలు నీరుగా ఉండటంచేత నీరు పెరుగునదే కాని తరుగునది కాదు. ఈ నదియొక్క అంతు కనుగొనటం కష్టం. ఈ నదిలో జలం నిరంతరం సంతృప్తిగా వుంటుంది. అందులో వూహలు అనే గాలి తరంగాలు అమితం.

నదిని దాటుటకు నావ ఆధారం. ఈ నావ ఓంకారం ఈ ప్రణవం శక్తిమంతం.

జగత్తులో కోరికలు తీర్చుకునేందుకు మూడు స్థాయిలు అనుభవిస్తున్నాం. అవి 1. ప్రేమ, 2 మోదం 3. ప్రమోదం.

**ఆనందం అంటే......**

ఒక రసవత్తరమైన మామిడి పండును చూస్తే నోరు వూరుతుంది. దానిపై ప్రీతి కలుగుతుంది. దీనినే ప్రేమ అంటారు. ఇది భ్రాంతితో కూడినది. ఊహతో కూడినది. ఊహ ఆధారంగానే మార్కెట్‌లో పండును కొంటున్నాము. చేతిలో ఉంచుకొని ఆనందిస్తున్నాం. ఈ ఆనందం అనిత్యం. దీనినే మోదం అంటారు. ఒక ప్రదేశంలో కూర్చుని ఆ మామిడిపండును తింటున్నాము. తినేటప్పుడు కలిగే ఆనందానికి మోదం అని పేరు. ఆశించటం, అందుకొనటం, అనుభవించటం వీటి స్వరూపాలు. వీటిలోనే మానవుని ఆనందమున్నది.

ఆశించటం, అందుకొనటం, అనుభవించటం— సంపూర్ణ స్వరూపమే ఓంకారం. పరమాత్మ విషయంలో కూడ వీటిని ప్రవేశపెట్టాలి, వీటినే శ్రవణం, మననం, నిధిధ్యాస అంటారు.

విన్న విషయాలు శ్రవణంచేయాలి. మననం చేయాలి. వాటిని హృదయంలో స్థిరం చేసుకోవాలి. ఇదియే నిధిధ్యాస. లేకుంటే విన్న విషయాలు నిరుపయోగమవుతాయి.

**కేవలం వంటచేస్తే ఏం లాభం ?**

వంట వండితే ఉపయోగం లేదు. దానిని భోజన శాలకు తెచ్చుకోవాలి. తినాలి. తిన్నదానిని జీర్ణం చేసుకోవాలి. లేకుంటే దేహానికి శక్తి రాదు. కేవలం వంటవండితే తృప్తి కలుగదు. ఇక్కడ వంటవండటం శ్రవణం. భోజనశాలకు తెచ్చుకోవటం మననం. జీర్ణంచేసుకోవడం నిధి ధ్యాస. అప్పుడే సరియైన ఆనందం కలుగుతుంది.

త్రిగుణాతీతతత్త్వాన్ని అర్థం చేసుకొని, అనుసరించి త్రిమూర్తి స్వరూపాన్ని చింతించాలి. తదుపరి శాశ్వత ఆనందాన్ని పొందాలి.

సర్వమత సమ్మతమైన, సర్వ ఆధారసమ్మతిమైన, రూపం అక్షరం. ఇదియే ఓంకారం. ఈ రూపనామాలు దేశకాలాలకు అతీతమైన వని శ్రీ బాబా చెప్పారు. ఇట్టి శాశ్వతమైన ఓంకారాన్ని స్మరించి ఆదివ్యరూప, ఆదిశబ్ద, అది తత్త్వమైన దివ్యత్వాన్ని అర్థంచేసుకోవాలి.

నీటిబుడగ నీటిలో పుట్టి నీటిలోనే లీనమైనట్లు ఆత్మలో పుట్టిన జీవులు ఆత్మలోనే లీనం కావాలి.

శ్రీ వారి దివ్యోపన్యాసము
వేసవి తరగతులలో
12-6-79

# దుఃఖాన్ని పోగొట్టేదే అసలైన విద్య

పాపభయంబుపోయె, పరిపాటుపోయెను
దుర్గుణంబులున్
శ్రీపతి భక్తిపోయె వివరించగలేని
దురంతకృత్యముల్
దాపురమయ్యె లోకమున, తాపసలోక
శరణ్యుడైన ఆ
శ్రీపతిపేరు చింతనమె చేకురచేయుదు
రమ్మ మానవా !

భారతీయ ఆధ్యాత్మికచింతనకు, ఆధ్యాత్మిక తత్త్వానికి మూలం భగవద్గీత. ఈ భగవద్గీత సర్వ ఉపనిషత్తుల సారం. విజ్ఞాన శాస్త్రం ప్రకాశించక పూర్వమే, వైజ్ఞానిక శాస్త్రం వికసించక పూర్వమే వైదిక పండితులు ద్రష్టలై శక్తిసామర్థ్యంతో సర్వ శక్తిని పొంది ప్రకృతిని కూడా వశం చేసుకున్నారు. ఇట్టి పవిత్ర దివ్యమహర్షుల సంప్రదాయమే భారతీయ సంప్రదాయం.

ఈ వైదిక పండితులు ఇష్ట ప్రాప్తికి, అనిష్ట పరిహారానికి వేదం మూలం అని నిరూపించారు. కర్మకాండ కేవలం మంత్రాలతో కూడుటచే దానిని మంత్రం అన్నారు. రెండవది బ్రాహ్మణం. ఈ బ్రాహ్మణంలో యజ్ఞ యాగాదులు ఆచరిస్తూ భౌతిక సుఖాలను అందుకున్నారు. కాని దీనిలో ఆత్మానందం లభించలేదు. ఈ ఆత్మానందం నిమిత్తమే ఋత్విక్కులు, ఋషులు, ద్రష్టలు అరణ్యంలో తపస్సు చేశారు.

వారు కనుగొన్న జ్ఞానతత్త్వాన్ని జగత్తులో ప్రచారం చేశారు. సుఖారణమైన జ్ఞానతత్త్వంతో కూడినది కనుక దీనిని ఉపనిషత్తులన్నారు. అరణ్యాలలో తపస్సు ద్వారా కనుగొన్నతత్త్వం కనుక అరణ్యకములు అన్నారు. భగవంతునికి సమీపంగా తీసుకొని పోయేవి కనుక ఉపనిషత్తులు అన్నారు.

## వేదాంతం అంటే......

ఈ ఉపనిషత్తులు వేదాలకు అంతములు వేదములకు అంతములోగల జ్ఞాన తత్త్వము వేదాంతం. జ్ఞానమంటే విద్య. ఇది తెలివికి మారు రూపం. దుఃఖంనుండి బంధాలనుండి విముక్తి గావించేదే అసలైన విద్య. కానీ నేడు విద్య అధికమయ్యే కొలది దుఃఖం అధికమవుతున్నది. నేటి విద్యలలో దుఃఖ నివృత్తిమార్గం ఏ మాత్రం కానరాదు. కారణం ఏకత్వాన్ని విశ్వసించక పోవడమే.

దీనికి స్వార్థమే ప్రధాన కారణం. ఇది అహంకారానికి మూలం. అహంకార, మమకారాలు చేరి మోహంగా రూపొందుతున్నవి. కాని నిత్యసత్యమైన దివ్యత్వం జ్ఞానం.

సత్యం ఒక్కటే. రెండింటితో కూడినది సత్యం కాదు. జగత్తులో రెండు పదార్థాలు లేవు.

''ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ'' "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'' సత్యమైనది ఒక అక్షరం. జ్ఞానం కూడా అక్షరమే. అనంతం అక్షరమే. సర్వాక్షరా

లలో అక్షరంలీనమై వున్నది. ఈ అ క్ష రా న్ని చూడడం జ్ఞాన దృష్టి. ఈ మూడింటిని ఏకంగా చూచే దివ్యత్వంలో పవిత్రజ్ఞానం వుంది. దివ్యత్వాన్ని నిరూపించేదానిని సంయమం అంటారు అంటే ఇంద్రియ నిగ్రహం.

### పులి పూరీలు తింటుందా ?

అభ్యాసంద్వారా ఇంద్రియనిగ్రహం అలవర్చు కోవచ్చు. కానీ పుట్టుకతో వచ్చిన దుర్గుణాలను ఎవరు అరికట్టగలరు ? పులికి సర్కస్‌లో ఎన్నోఫీట్స్ నేర్పవచ్చు. పులికి ఆకలైతే పూరీలు తినదు. మాంస భక్షణం దాని సహజగుణం. ఈ అలవాటు నుండి దానిని మార్చలేం. పిల్లికి పాలు పెరుగు ఎంత పోసినా ఎలుకను చూస్తే మాత్రం వదలిపెట్టదు. ఈ గుణాలు వాటికి పుట్టుకతో వచ్చినవి.

దుర్గుణాలను తొలగించుకునేందుకు మానవుడు స్వయంగా ప్రయత్నించాలి ప్రయత్న పూర్వకంగా దేనినైనా సాధించవచ్చు. కానీ మానవునిలో పవిత్ర ప్రేమతత్త్వం శూన్యమవుతున్నది.

### చీమ ఏం చదువుకుంది ?

ఒక చీమ బెల్లం ముక్కను చూస్తే అది ఒక్కటే స్వార్థంతో తినదు. తోటి చీమలను పిలుచుకొని వచ్చి ఇతర చీమలతో కలిసి తింటుంది. కానీ మానవుడు స్వార్థంతో సంకుచిత హృదయుడై జీవిస్తున్నాడు

కాకిని చూస్తే అసహ్యించుకుంటాం. ఇంటివద్ద అరిస్తే రాయితో కొడతాం. కాని అన్నం మెతుకులను ఒక్క కాకి మాత్రమే తినదు. ఇతర కాకులతో కలసి తింటుంది. చీమలకు ఏం చదువుంది ? కాకులకు ఏ డిగ్రీలు వున్నాయి ? వీటిలోని చక్కటి గుణాలను ప్రతివ్యక్తి అర్థం చేసుకోవాలి;

ప్రతివ్యక్తి అన్నంలో కాదు, ఆత్మలో జీవించాలి. భక్తిప్రపత్తులకోసం జీవితమున్నది కాని భుక్తియుక్తుల కోసం కాదు. హృదయంలో పవిత్ర జ్ఞానంపొందాలి.

### రామునికి ఇష్టమైన శ్లోకాలు

భక్తరామదాసు కొన్ని వేల శ్లోకాలు వ్రాశాడు. వీటిలో రామునికి అత్యంత ప్రీతికరమైన శ్లోకాలు ఏవి ? అని ప్రశ్నించుకున్నాడు. సమాధానం దొరకలేదు. జుగుప్సతో వాటిని కట్టకట్టి గోదావరిలో పారవేశాడట.

ఇందులో కేవలం 100 శ్లోకాలు మాత్రం పైకి తేలాయి. అంటే చిత్తశుద్ధితో, ఏకాగ్రచిత్తంతో, భక్తి ప్రపత్తులతో వ్రాసిన శ్లోకాలు మిగిలాయి మిగిలినవి మునిగాయి. పవిత్ర హృదయంతో ఏ కొంచెం చేసినా అది దివ్యంగా ప్రకాశిస్తుంది. కేవలం భక్తివుంటే ప్రయోజనం లేదు. చిత్తశుద్ధి కూడా వుండాలి.

ఒక రైలును లేక బస్సును నిలపాలంటే బ్రేక్ వేయాలి. ఇంజన్‌లోని డ్రైవర్ చిన్న బ్రేక్ వేస్తే రైలు నిలుస్తుంది. అనేక విధాల వేగంతో పరుగెత్తుతున్న చిత్తవృత్తులను, ప్రేమతో, జ్ఞానంతో అరికట్టాలి. ప్రతి వ్యక్తి స్వార్థరహిత ప్రేమను అలవర్చుకోవాలి. భగవత్ప్రీతికరమైన కార్యాలు చేయాలి.

ఇంటిలో అబద్ధాలు చెప్పి సొమ్మును దొంగిలించే కొడుకును క్షమిస్తాం. కాని, పని మనిషి చిన్న దొంగతనంచేస్తే అతనిని పోలీస్‌స్టేషన్‌కు అప్పగిస్తాం. కుమారుడు దొంగ అయితే నయానా, భయానా నచ్చ జెప్పి సరిచేసుకుంటాం. కాని, పనిమనిషిని పరాయి వాడుగా చూస్తున్నాం. భగవంతుని ప్రేమకు పాత్రులైనప్పుడు తెలిసో, తెలియకో చేసిన పాపాలు క్షమించబడతాయి.

అర్జునా, ప్రేమమార్గాన్ని అభివృద్ధి చేసుకోవాలి. దివ్యత్వంలోని ఏకత్వాన్ని అర్థం చేసుకోవాలి. ఈ ఏకాగ్ర భావాన్ని అనేకత్వంలో దర్శించాలి.

### జ్ఞానమే అక్షరం యొక్క స్వభావం

జ్ఞానమే అక్షరం యొక్క స్వభావం. నాశరహిత రూపం, అక్షర ప్రతిబింబం. పరిపూర్ణశబ్దమే నామం. సర్వత్రా ఓంకార నామం నిండి ఉంటుంది. మనకు వినిపించనంత మాత్రాన అక్కడ శబ్దం లేదని భ్రమించరాదు. కదలికలో కంపం, కంపంలో శబ్ద మున్నది.

శబ్దబ్రహ్మమయ, జోతిర్మయ, విజ్ఞానమయ, సత్య మయమైనది ఓంకార స్వరూపం. ఈ తత్త్వాన్నే ప్రేమతో కృష్ణుడు అర్జునునకు బోధించాడు. సర్వ వేదాలలో ఓంకారం వున్నది.

నేడు సంధ్యావందన సమయంలో పెక్కుమంది పండితులు ఓంకారాన్ని వెనుకకు నెట్టి 'నారాయణాయ నమః ఓం' అంటారు. ఈ ఓం జీవితానికి ఇంజను వంటిది. ఇతర దేశాలు పెట్టెల వంటివి. యజ్ఞయాగా దులు దీనికి నిప్పుగా వుంటున్నవి. ఇంజనులో అవతార పురుషుడుగా డ్రైవరు వున్నాడు.

యజ్ఞయాగాదులు చేసేందుకు వేదప్రమాణాలు ఇక్కడనే ఉద్భవించాయి. వేద ప్రమాణాలు ఆవిర్భ వించినచోటనే యజ్ఞయాగాదులు చేయాలి.

ఇతిహాస పురాణ ప్రమాణాలచేత భారత దేశం నాయకత్వం వహిస్తున్నది. పవిత్రయాగ, కర్మ, త్యాగ భూమిలో నేడు మనం రోగజీవులుగా బ్రతుకు తున్నాము.

ప్రతి వ్యక్తి త్యాగ గుణాన్ని అలవరచు కోవాలని బాబా ఉద్బోధించారు. పోయే టప్పుడు పిడికెడు మట్టి కూడా వెంట రాదు. త్యాగంలో ప్రేమవున్నది త్యాగ గుణం లేకుంటే దేహం క్షీణిస్తుంది. దేశ, దేహ క్షేమం నిమిత్తం ప్రతి విద్యార్థి గీతాసారాన్ని హృద యానికి హత్తుకుని ప్రచారం చెయ్యాలి.

శ్రీ వారి దివ్యోపన్యాసము
వేసవి తరగతులలో
(13-6-79)

# 'జ్యోతిర్గమయ'

ఈ వేసవి తరగతుల్లో ఇచ్చే శిక్షణ, కళాశాల లందించే లౌకిక విద్యా విషయాలకు ఆధ్యాత్మికమైన అనుబంధం, దీనికి ప్రారంభోపన్యాసం ఇవ్వటం నాకు తలకు మించిన భారమనే చెప్పాలి. నిజానికి నాకే కాదు తగినంత గాఢమైన పరిజ్ఞానం లేకుండా మాట్లాడేవారి కెవరికైనా కష్టసాధ్యమే. కాని, బాబా ఆ పనిని ప్రతిరోజూ తమ దివ్య దర్శన మాత్రంతో, మందహాసంతో, మౌనవ్యాఖ్యానంతో నిర్వహిస్తున్నారు. మనం నిజానికి వారి పరోక్ష సాధనాలం మాత్రమే, అంతకంటే మరేం కాదు. ఒకప్పుడు నెహ్రూ, మహా త్మాజీ గురించి చెప్పిన మాటలు ఇప్పుడు నా హృద యాంతరాళంలో నినదిస్తున్నాయి. ఎందుకంటే -

ఆ మాటలు బాబాపట్ల సార్థకంగా వర్తిస్తాయి కాబట్టి –

"ఆయన నడిచిన చోటెల్లా పవిత్ర పుణ్యస్థలం
ఆయన నిలిచిన చోటెల్లా పవిత్ర దేవాలయం."

నాస్తికులు, విమర్శకులు, శాస్త్రవేత్తలు, హేతువాదులు–వారి చిత్తశుద్ధిని పరిగణనంలోకి తీసుకున్నా– వారు దర్శించ గలిగింది అఖండ సత్యంలోని భాగాలను మాత్రమే. అతీంద్రియమైనదీ, భౌతిక పరిధికి అతీతమైనదీ అయిన అఖండ సత్యాన్ని దర్శించటం వారికి అగమ్యగోచరమైంది. మనం ఒక్కసారి దివ్య హేతువాదమైన ఆ ఆత్మవిజ్ఞానాన్ని, అనిత్య–సత్యాన్ని సాధింపగలిగితే ఆ అఖండ సత్యం అవగతమౌతుంది; ఆధ్యాత్మికబలంవల్ల ఆ ఋష్యస్పష్టి చేయగలిగే శాస్త్రంగాని, తదనుబంధ విజ్ఞాన విశేషాలుగాని అద్భుత చర్యలనే అపోహ తొలగిపోతుంది. వారు నిజంగా తెలుసుకోలేక కోల్పోయింది చాలా ఉంది– బాబా ప్రవచనాల్లోని మహత్తరమైన మహిమ అనంత ప్రేమభావమనీ, సంపూర్ణ దయాభావమనీ, విశ్వమానవ సౌభ్రాతృత్వమనీ, అద్వైతమకరందమనీ దర్శించ లేకపోవటమే విష్ణుపురాణంలో భగవంతుని లక్షణాలు చెప్పబడిన ఆరు విశేషాలనూ సంవదించుకొంటూ అవతారమెత్తి ప్రాచీన మహర్షులూ, వేదాంతులూ యుగయుగాలుగా ప్రపంచించిన సత్యాలను సమన్వయించుకొంటూ బాబా లోకానికి ప్రబోధిస్తున్నారని గమనించ లేకపోవటమే. అయిన్‌స్టీన్ మహాశయుడు చెప్పిన మాటలు బాబాపట్ల చక్కగా అన్వయిస్తాయి.

"ఇటువంటి వ్యక్తి భూతలం మీద మానవాకృతిలో ఒకసారి సంపూర్ణ జీవితాన్ని సాగించాడని భావితరాల వారు సులభంగా నమ్ముతారని అనుకోవటం కష్టం"

అందువల్ల, నేను వినమ్ర భక్తిభావంతో ఈ పవిత్ర సమావేశంలో 'సంస్కృతి, ఆధ్యాత్మికత' అనే ఉదాత్త విషయం మీద నాలుగు మాటలు మాట్లాడటానికి ప్రయత్నిస్తాను. ఎన్నో విరోధాభాసాలతో సతమతమయ్యే మన వివేకాన్ని వెలుగుతో నింపుకొని మనలో ఉన్న లోతైన ఆధ్యాత్మిక మహాసాగరాన్ని మథించి అందులోని నిగూఢ రహస్యాలను తెలుసుకోకపోతే మానవజీవితం ఒక వృథాకాలయాపన అవుతుంది. మనం పొందే విద్యార్హతలు పై పై మెరుగులకు కొలిచే ప్రయోజనం లేని ప్రమాణాలుగానే మిగిలిపోతాయి. ప్రేమ సిద్ధాంతంలోని పరమార్థాన్ని మనం తెలుసుకోలేకపోతే, మనస్సును మానవత్వంవైపు మళ్ళించి మనిషిని దివ్యత్వంలోకి తీసికొనిపోయే ఉదాత్తమైన విలువలను ప్రసాదించే పరమార్థాన్ని గ్రహించలేకపోతే మనవిద్య అంతా డొల్ల, విజ్ఞానమంతా అపరిపక్వం; పాండిత్యమంతా ఖసుపుచేటు. మానవజీవితం ఉన్నస్థితినుండి ఉన్నత పథాల వైపు పయనించకపోతే, భగవంతుడవతరించి దివ్య ప్రేమ భావంతో జీవించకపోతే మనుష్యులందరూ మేకల్లా, గొర్రెల్లా పశుజీవితంలో పడి ఉండవలసిరాదా?

'అల్పుడైనను గాని అధికుడైనను గాని
అందరిని ఒకటిగా ప్రేమింప గలవాడె
ఆరాధనము చేయ సర్వుడౌ ఇలలోన
ప్రేమ స్వరూపుడౌ భగవంతుడే మనల
ప్రేమతో సృష్టించె; ప్రేమతో లాలించె'

ఈ మాట ఎంత సూక్తియో, అంత సత్యం కూడా.

పాశవిక శక్తిగా మానవుడు ఉద్వేగమూర్తి; ఆత్మస్వరూపుడుగా అతడే పరమ శాంతమూర్తి. అంతరాత్మ సాక్షాత్కారం కలిగిన క్షణంనుండి అతడు ఉద్వేగమూర్తిగా ఉండలేడు. మనిషికి రెండే మార్గాలు తెరువబడి ఉన్నాయి. ముందుకు పోదలచుకుంటే అహింసవైపు పురోగమించాలి. లేదా మృత్యువువైపు తిరోగమించాలి. అంతే. అందువల్లనే ప్రవక్తలు,

అవతారపురుషులు అహింసను చేరటానికి సత్యం, సమదృష్టి, సౌభ్రాతృత్వం, ధర్మం మొదలైనవి మార్గాలని ప్రబోధించారు.

హేతువాదులూ, విప్లవవాదులూ, కూడా సాటివారి మీద ప్రేమ వల్లనే తనువులను కూడా బలిపెట్టడానికి ముందుకు దూకుతారు. లోకంలో మంచిపనులూ మహత్కార్యాలూ అన్నీ ప్రేమతో సాధింపబడుతున్నాయి కాని, ప్రయోజన దృష్టితో కాదు. జీవిత సమరంలో విజయం ప్రేమ శక్తితోనే సాధ్యం. మానవులందరూ విశ్వాత్మభావాన్ని పెంపొందించుకోవాలనీ, కరుణ, భ్రాతృభావం, ప్రేమ, త్యాగం-మొదలైన ఉదాత్తగుణాలను అలవరచుకోవాలనీ ప్రవక్తలందరూ తమ ప్రవచనాల్లో ప్రపంచిందారు. అందువల్ల నిజమైన విద్యావిధానం మనిషిలోని అంతర మానసిక పరిణామాన్ని విస్మరించలేదు.

ఇప్పటి విద్యావిధానం విద్యార్థుల మనోమందసాన్ని ప్రకృతి విజ్ఞానం తోనూ, ప్రాపంచిక కళా వివేకంతోనూ నింపివేస్తోంది. కాని, నిజమైన సంస్కృతి మనిషి అంతర్ముఖుడై ఆత్మ విజ్ఞానాన్ని, అఖండ సత్యవివేకాన్ని సాధించే సంస్కారాన్ని సుసంపన్నం చేసికొన్నప్పుడే ఏర్పడుతుంది. బాబా మాటల్లో చెప్పాలంటే-అనూచానంగా నేడు బోధింపబడుతున్న విజ్ఞానశాస్త్రం బాహిరమైన జగత్తుకు సంబంధించింది. సారభూతమైన ఆత్మ విజ్ఞానం అంతర జగత్తునుగూర్చి బోధించేది. ఆధ్యాత్మిక అభ్యున్నతికి సంబంధించిన విలువలు నేటి విద్యాలయాలలో అసందర్భాలుగా భావింపబడుతున్నాయి. నిజానికి సత్యదర్శనానికి లౌకిక విషయ వివరణంతో కూడిన విద్య అనవసరం. 'బాలుని బుద్ధి, ప్రజ్వలింపచేయవలసిన అగ్నిశిఖగాని, నీళ్లు నింపే కుండవంటిది కా'దన్న జాన్‌లాకే మాటలు సందర్భశుద్ధితో సంస్మరింప దగినవి. బాబా కథలద్వారా, గాథలద్వారా, ప్రవచనాల ద్వారా, అనుభవాలద్వారా మానవాళి అంతరాత్మలను ప్రజ్వలింపచేసి ఆధ్యాత్మిక అభ్యున్నతిని అందిస్తున్నారు. అవన్నీ చెప్పటం క్రొత్త విషయాలను చెప్పి సమాచారాన్ని అందించి వాటిమీద నమ్మకాన్ని పెంచటానికి మాత్రం కాదని గుర్తించాలి.

బాబా ఒక బాలుని కథ చెప్పారు. ఆతడు అస్వస్థురాలైన తల్లిని ఎంతో శ్రద్ధతో సేవించాడు. ఆమె చనిపోతే ఎంతగానో శోకించాడు. ఆ కథలో బాబా భవబంధాలవల్ల ఏర్పడే మోహాన్ని ఎత్తి చూపారు. భౌతిక కాయం నిర్వహించే పాత్రను గౌణం చేసి చూపించారు. ఆ కథలో ఆతల్లి రూపం ఒక ప్రయోజనం సాధించేవరకే అవసరమైంది. పొట్టకూటికి చెప్పే మెట్టవేదాంతాలకూ, ఆత్మ వికాసాన్ని కలిగించే ఆధ్యాత్మిక అనుభూతికీ ఉన్న భేదాన్ని బాబా చక్కగా వివరించారు. నియమనిష్ఠలన్నీ ఆత్మ సాక్షాత్కారాన్ని అందించలేవని చెపుతూ బాబా ఇలా అన్నారు.

"పదిలక్షల మంది పద్మాసనాలు వేసికొని
ధ్యానానికి కూర్చున్నారు
అందులో ఒకడికీ భవబంధమోక్షం
కలగలేదు. అంటే
అందులో గమనింపదగిన అంశమేమిటి ?
అందులో గురువుగారైనా
మోక్షం సాధిస్తే కాస్త అర్థంఉంటుంది.
అదీ జరగలేదు."

మనిషిలో అంతర్నిహితంగా ఉన్న సమగ్రత్వం యొక్క ఆవిష్కారమే విద్య అంటారు స్వామి వివేకానంద. సమగ్రత్వమంటే వ్యక్తివికాసం కాని పుస్తక పరిజ్ఞానం మీద ఆధారపడిన పాఠశాల, కళాశాల, వృత్తివిద్యల ప్రమాణాలకు సంబంధించిన పరిజ్ఞానంలోని వాదోపవాదాల సంపుటీకరణం కాదు.

మానవ వ్యక్తిత్వంలోని ఔన్నత్యం సంస్కృతి శీలాలమీద ఆధారపడి ఉంటుంది. సంస్కృతి భూత దయ వలన, శీలం ఇంద్రియనిగ్రహం వలన రూపొందుతాయి. ఇక్కడ నిర్వహింపబడుతున్న వేసవి శిక్షణ తరగతులలోని అధ్యయనాంశ విధానం లౌకిక విద్యాతీత మయింది; సాంస్కృతిక శీల సమ్యగభ్యాస పద్ధతుల్లో అత్యంత అధునికమైంది: ఆధ్యాత్మిక సంబంధం సంతరించుకొన్నది; ఆత్మోన్నతికి అనువైన అనుభవముద్రను అందించేది. ఇటువంటి అధ్యయనం లేని ఏ ఉన్నత విద్యా కేంద్రమైనా మనదేశంలో ఉండే అది తప్పకుండా అన్ని వేళలా ఆందోళనలకు ఆలవాలమౌతుంది; పరీక్షలు ఉద్వేగ జనకాలుగా పరిణమిస్తాయి. చివరకు విద్యార్థుల జీవితాలు విలువలేనివిగా వెలవెలపోతాయి.

ఆధ్యాత్మిక విద్య మనిషిలోని దివ్యత్వాన్ని వెలికి తెస్తుంది. సమాచారాన్ని బోధించే లౌకిక విద్య కంటే అది ఉన్నతమైంది. భౌతికమైన విద్యల్లో ప్రావీణ్యాన్ని, కళా ప్రతిభలను సాధించినదానికంటె అది ఉత్తమమైంది. అది సృజనాత్మకమైంది: సంస్కృతి విశిష్టమైంది: శీల నిర్మాణసమర్థమైంది. అదే నిజమైన విద్య. మానవుడు-సృష్టి-సృష్టికర్తల మధ్య అద్వైత భావనాత్మకమైన ఆధ్యాత్మిక చింతన విద్యార్థికి అది ప్రసాదిస్తుంది. అది ప్రతి జీవికీ విశ్వాత్మకమైన వివేకంతో వెలుగొందే వెలుగును అందిస్తుంది. విశ్వాతీతంగా ఉంటూ, విశ్వవ్యాపకంగా అణువణువునా వ్యాపించి ఉన్న భగవచ్చైతన్యాన్ని గుర్తించి, తద్రూపంగా భావించి, బాధాసర్పదష్టులైన సాటి మానవులకు సేవచేయటమే భగవదారాధనంగా తలంచి సేవా భావాన్ని పెంపొందించుకొనే ప్రవృత్తిని ప్రకాశింపజేస్తుంది. బాబా ఈ విషయాన్ని స్పష్టంగా పేర్కొన్నారు.

'మానవుడు మానవాకృతిలో నున్న భగవంతుణ్ణి ఆరాధించాలి: భగవంతు దేరూపంలోనైనా రావచ్చు. గుడ్డివాడుగానో, వెర్రివాడుగానో, కుష్ఠరోగిగానో, బాలుడుగానో, బక్కచిక్కిన ముసలి వగ్గుగానో, నేరస్థుడుగానో, పిచ్చివాడుగానో రావచ్చు. వాళ్లను చూచి తొలగిపోవటంగాని, ఏవగించుకోవటం కానీ కాదు చేయవలసింది. ఆ మూర్తులను అడ్డం పెట్టుకొని వస్తున్న దివ్య ప్రేమమూర్తిని, శక్తిని, ఆత్మజ్ఞానాన్ని, సాయిని నీవు చూడగలగాలి సేవతో నీవు ఆ భగవంతుణ్ణి ఆరాధించాలి !

తాత్పర్యమేమిటంటే-నిజమైన విద్య అంతరాత్మకు అభ్యున్నతిని కలిగిస్తుంది. ఉపనిషత్తులు కూడా దాన్నే బోధిస్తున్నాయి.

'ఇదంతా భగవంతుడు నిర్మించిన వసతిగృహం ప్రతివ్యక్తి చైతన్యం విశ్వచైతన్యంలో విడదీయలేని భాగమే. అందువల్ల త్యాగబుద్ధితోనే జీవితాన్ని అనుభవించు; అన్యులది అపహరించి అనుభవించాలన్న భోగ వాంఛను వీడు.'

'యోగస్థః కురు కర్మాణి' నీవు నీ స్వీయ కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే భగవంతుని సన్నిధానాన్ని భావించి అందులో అద్వైతసిద్ధిని సాధించే సంతత అభ్యాస శీలాన్ని అలవరచే విధానం ఈ విద్యలో అంతర్భాగంగా ఉన్నది. ఉత్తేజకరమైన సాయి సన్నిధానం, లౌకికాతీతమైన 'చదువుల సారాన్ని' అందించే ఈ వేసవి శిబిరంలోని అధ్యయన విధానం విద్యార్థుల్లో విశిష్టమైన జీవన దృక్పథాలను కలిగిస్తాయి బడి చదువులంటే పరీక్షలు వ్రాయటం కాదనీ హృదయాలకు నూత్నచైతన్యాన్ని కలిగించుకోవటమనీ, మెదడులనే సంచీలను సమాచారమనే వస్తువులతో నింపటం కాదనీ, బుద్ధి వికాసం యొక్క పరమావధిని అందుకోవటమనీ, భగవత్సందేశాన్ని విని దాని కనుగుణంగా వర్తించటానికి అనువైన ఉన్నతాధ్యాత్మిక శక్తిని సాధించటమనీ విద్యార్థులు తెలుసుకోవాలి. సంస్కృతి అంటే ఇదే ఆధ్యాత్మిక

చింతన విధానాన్ని అభివృద్ధి చేసుకోవటం. జంతు పరిణామక్రమంలో సాధించే ఫలితాలను తెలుసుకొనే పరిజ్ఞానంకంటె అది భిన్నం ఉన్నతం.

బాబా దర్శకత్వంలో నిర్వహింపబడుతున్న ఈ వేసవి అధ్యయన విధానం 'జ్యోతిర్గమయ' అన్న ధ్యేయాన్ని అందుకోవటానికి తీర్చిదిద్దబడింది. ఈలక్ష్యంతో సాయి విధానం నేటి విద్యావిధానానికి అందించే విలువైన కానుక. నేటి విద్యావిధానం అవసరం లేని ఎన్నో అంశాలకై అహోరాత్రాలూ పోరాడుతూ, వాటినే సాధించలేక కష్ట నష్టాలకు గురియైపోయింది. దాన్ని ఉద్ధరించటానికి ఇది ఒక దివ్యౌషధం !

బాబా సూక్తులలో ఒకటి ఇక్కడ ప్రస్తుతం.

'విజ్ఞానానికి ఫలం స్వాతంత్ర్యం,
జ్ఞానానికి ఫలం మోక్షం
సంస్కృతికి ఫలం సమగ్రత్వం
జ్ఞానానికి ఫలం ప్రేమ
విద్యకు ఫలం శీలం !

వ్యసనాలకూ వైషమ్యాలకూ, అనారోగ్యాలకూ బలహీనతలకూ, అర్థరహితమైన హేతువాదాలకూ, భోగమయమైన ఐహిక విషయవాదాలకూ అతీతంగా మన విద్యాలయాలను తీర్చిదిద్దుకోవలసిన తరుణం ఆసన్నమైంది. మెదడుకు మేతవేసి మనసును పస్తు ఉంచటం, నైతిక వర్తనంమీద నిర్లిప్తతను పచరించి శాస్త్రవిజ్ఞానం వల్ల ఏర్పడిన మొండితనంతో కూడిన కృత్రిమ హేతువాద ప్రవృత్తిని పెంచుకోవటం సమాజ సుఖశాంతులను పరిక్షించి నిర్వహింపవలసిన ధర్మాన్ని విస్మరించటం, ఆత్మవిజ్ఞాన వికాసానికి విముఖంగా ఉండటం, మానసిక విశ్లేషణ విధానం నుండి విముక్తిని సాధించలేకపోవటం – అనే అనర్థాల వల్ల సమకాలీన ప్రపంచంలో ఆధునిక మానవుని అస్తిత్వానికి అపాయం వచ్చిపడింది. ఆధ్యాత్మ విద్యయే విద్యలలో మేటివిద్య, శాస్త్రాలలో ఉత్తమ శాస్త్రం. ఈ సత్యాన్ని దర్శనం లేని శాస్త్రజ్ఞులు గ్రహించలేరు. ఆత్మలు దివాలా తీసిన వారూ, హృదయాలు ఓటుపడ్డవారూ, తలలన్నీ బరువుతో దిమ్మెక్కిన వారూ తెలుసుకోవలసిన విషయం ఏమంటే—

"శీలం లేని విద్య, మానవత్వంలేని శాస్త్రవిజ్ఞానం,
నీతి లేని వ్యాపారం ప్రయోజనం లేనివేకావు
ప్రమాదకరాలు కూడా" (బాబా)

ఇక్కడ నేనొక విషయం నొక్కిచెప్పాలి. నా సిద్ధాంతం భౌతిక హేతువాదానికి వ్యతిరేకం కాదు; ప్రతిపక్షమూ కాదు. దానికి ఆధ్యాత్మికవాదం అనన్యంగా, అవిభాజ్యంగా, అంతర్భాగంగా ఉండాలనే ప్రగాఢ విశ్వాసాన్ని ప్రతిపాదించటమే ప్రధానమని స్పష్టంచేస్తున్నాను.

ఈ అధ్యయన తరగతుల వల్ల బాబా మన ప్రపంచ దృక్పథంలోనూ, అంతరాత్మల వివేచనంలోనూ మౌలికమైన మార్పులను తీసికొని వస్తున్నారు. Edugar Mitchel అనే వ్యోమయాన విజ్ఞానవేత్త "Psychic Exploration - A challenge for Science" అనే తన గ్రంథంలో మానవాత్మల ఆధ్యాత్మిక అభ్యున్నతిని గూర్చి ఇలా భావించాడు.

"విశ్లథమైన మన మానసిక ప్రవృత్తులకు ఆరోగ్యాన్ని, వికావికలైన సమాజానికి సమైక్యతనూ, అస్తవ్యస్తంగా ఉన్న మన పరిసరాలకు ఒక సంవిధానాన్ని ఆధ్యాత్మిక అభ్యున్నతియే కలిగించాలి. ఇంతవరకూ శాస్త్రవిజ్ఞానం విడిపడిపోవటమే నేర్పింది కా ఆరోగ్యమంటే సమగ్రతయే. డానే రూధ్యార్ అనే తత్త్వవేత్త అన్నట్లు 'శాస్త్రాన్ని బాగుచేయాలంటే మనమింకా విస్తృతమైన సమగ్రతలను నిర్మించాలి

భౌతిక హేతువాదాతీతమైన శక్తులను అభివృద్ధి చేసుకొని, ఆత్మవిజ్ఞానాన్ని నిర్మించుకొనే తరుణం ఇప్పుడాసన్నమైంది. అది మనం సాధిస్తే శాస్త్రానికీ తత్త్వానికి (మతానికీ), బహిర్వాదానికీ, అంతర్వేదానికీ, భౌతిక విజ్ఞానానికీ, ఆధ్యాత్మిక సాధనకూ మధ్య శుభోదర్కమైన సంవిధానానికి పునాది పడుతుంది. మెదడుకూ మనసుకూ, అంతర్దృష్టికీ ఆత్మాభివ్యక్తికీ, కలిగే ఈ సంయోజనం భౌతికాతీతమైన ఆధ్యాత్మిక శాస్త్రం తన భౌతికప జ్ఞానానికి అనుసంధించుకోవటానికి మార్గం వేస్తుంది అంటే- పరమాత్మను శాస్త్రీయంగా వెదుకొనే పద్ధతి ఆవిష్కరింపబడుతుంది. అప్పుడు మన శాస్త్రీయవిజ్ఞానం ఆత్మ విజ్ఞానంగా పరిణమిస్తుంది. మన అధికాక వ్యామోహం ప్రేమశక్తిగా పరివర్తనం చెందుతుంది. అప్పుడు విశ్వాంతరాత్మ చైతన్యంతో నిండిన విశ్వమానవుడు ఉద్భవిల్లుతాడు !

[భారత సుప్రీ కోర్టు న్యాయమూర్తులు
శ్రీ వి ఆర్. కృష్ణఅయ్యర్‌గారిచ్చిన
వేసవితరగతుల ప్రారంభోపన్యాసంలోని భాగం]



# రక్షక భటులు—'డ'కార త్రయం

ప్రేమ స్వరూపులారా ! లోకము అనాది. కాలము అనంతము. కాయ ప్రమాణము అత్యల్పము. ప్రచండ మారుతమువలె మనయొక్క కాలము కదలి పోవుచున్నది. కాయమునకు కేటాయించినటువంటి ఆయుఃప్రమాణము మంచుగడ్డవలె కరిగిపోవుచున్నది కర్తవ్యాన్ని గుర్తించక మానవుడు కాయన్ని వదలి పోవుచున్నాడు. ఇది కేవలము మానవత్వానికి ఒక ప్రధాన లక్షణము కానేరదు. ఈనాటి మానవుడు వైజ్ఞానికశాస్త్రం అభివృద్ధి గావటంచేత ఆకాశములో పక్షివలె ఎగుర గలుగుచున్నాడు జలములో చేపవలె ఈదగలుగుచున్నాడు. కాని మానవుడు భూమిపైన మానవునివలె బ్రతుకలేకున్నాడు. మానవుడుగా భూమిపై జీవించుటకు తగిన శక్తిసామర్థ్యములు సంపాదన చేసికోనట్టి సమయమునందు తాను ఎన్ని విద్యలు నేర్చిగాని ఎన్నివిధములైన జీవితములయందు ఆశలు పడినప్పటికి, ఇవి సార్థకము కానేరవు. మానవత్వానికి అతీతమైన దివ్యశక్తి నీడను నిల్చి దానియొక్క తత్త్వముచేతనే తన నిత్యకర్మలను జీవిత కర్తవ్య ధర్మములుగా ఆచరించగలుగు చున్నాడు మొట్టమొదట మనము సర్వాధారమైన ఈ దివ్యతత్త్వాన్ని గుర్తించడానికి ప్రయత్నించాలి.

ఇది ఒక హారము. మనకు ప్రత్యక్షంగా పుష్పములు మాత్రమే గోచరిస్తున్నాయి. కాని ఈ పుష్పములకు ఆధారమనే దారము లేకుండా ఇవి నిలిచి వుండటానికి వీలుకాదు. కాని ఈ దారము మనం విచారణ చేసినప్పుడే గుర్తించడానికి వీలౌతుంది కాని, బాహ్య దృష్టితో చూచినంతవరకు పుష్పములు మాత్రమే మనకు తెలుస్తుంటాయి కనిపించే పుష్పములకు, హారమునకు, కనిపించనటువంటి దారము ఆధారముగా ఉంటున్నది. ఐతే కనిపించే పుష్పములు నిన్నటి

దినము మొగ్గలు నేడు విచ్చినవి. రేపటి దినము వాడిపోవునవి కాని దీనికి ఆధారమైన దారము నిన్నా దారమే, నేడూ దారమే, రేపూ దారమే. పుష్పములు అనేకము, దారము ఏకము. అదే విధముగా మనము. వాడిపోయి, రాలిపోయి, కూలిపోయే మన దేహములన్నియు పుష్పముల వంటివి. కొంతకాలము బాల్యము, మరికొంతకాలము కౌమారము మరికొంతకాలము యౌవనము. తదుపరి వార్ధక్యము. ఈవిధంగా కాలానుగుణంగా మార్పులుచెందే పుష్పముల వంటివే మన దేహములు కాని ఈ పుష్పము లన్నిటి యందు ఆధారమనే సూత్రము దైవత్వంగా నిరూపిస్తూ వస్తుంది ఆ దైవత్వమనే దారమే లేకుండిన మన మందరమును ఒక్కచోట చేరుటకు వీలేకాదు దారము ఏకము, పుష్పములు అనేకము. జీవులు అనేకము దైవము ఏకము. అందువలననే ఏ జాతి, ఏ మతము ఏ ప్రాంతము ఏ దేశము ఐనప్పటికిని, మానవత్వమనే జాతి అన్నిటియందు దివ్యత్వమైన ఆత్మతత్త్వముతో కూడియుంటున్నది. దేశకాల పాత్రములకు అతీతమైనట్టిది దివ్యత్వము. ఈనాడు మీరు ఇక్కడ చేరినట్టి ఈ Campus లో అనేక దేశములనుంచి అనేక రాష్ట్రములనుంచి వచ్చిన ప్రజలు ఇక్కడ చేరి వున్నారు. అనేక వర్ణములతో కూడిన పుష్పములు ఉండిన నందన వనముగా ఉన్నది ఈ యొక్క Campus ఐతే దేశములు వేరు, భాషలు వేరు, వ్యక్తులు వేరు, ప్రాంతములు వేరైనప్పటికిని మన యొక్క అనుభూతి కాని మనయొక్క training కాని మనయొక్క ఆదర్శము కాని, ఏకముగా నిరూపిస్తూ వస్తున్నది. ఐతే మనయొక్క అధికారమునకు ప్రధానమైన మూడు సూత్రములు మనము గుర్తించాలి మొట్టమొదటిది Duty, రెండవది Discipline. మూడవది Devotion Discipline Devotion and Duty అను ఈ ప్రకార త్రిపుటమును మన జీవితములో అనుభవించటానికి ప్రయత్నము చేసినప్పుడు మన కర్తవ్యాన్ని కూడ గుర్తించుకొన్న వారమవుతాము. అందులో Police శాఖకు Discipline చాలా అవసరము. అనేక శ్రమలతోను అనేక కష్టనష్టములతోనూ ఎన్నో ఇక్కట్టులతోనూ కూడినట్టి ఉద్యోగము ఈ Police ఉద్యోగము. నిజముగా మీరు దేశమునకు రక్షక భటులుగా ఉంటున్నారు. ఇలాంటి రక్షకభటులైన పోలీసులందు ప్రధానమైన discipline ను మనము develop చేసుకోవలె. ఈ discipline కు మన devotion కూడా అంతరంగికమైన భావముతో ఉప్పొంగి రావలె మన ముఖ్య కర్తవ్యమైన దీనిని నిర్వర్తించుచూ ఉండాలి ఈ నాడు లోకములో ఏ చదువు చదివినప్పటికిని, ఏ trainingకు వెళ్ళినప్పటికిని నా భవిష్యత్తు ఏ మార్గములో ఉంటుంది? ఏ ప్రాంతంలో సుఖంగా ఉంటుంది? అని వ్యక్తిగతమైన సుఖాన్ని, అనుకూలాన్ని ఆశిస్తూ వుంటుంటారేకాని, "నావల్ల ఈ దేశానికేమి సుఖము? ఈ సమాజమునకు ఏమి సుఖము? అని ఆశించే వ్యక్తులు అరుదుగా కనిపిస్తున్నారు. తమ స్వార్థ సంబంధమైన భవిష్యత్తును మాత్రమే లక్ష్యమునందుంచుకొని జీవించడానికి ప్రయత్నిస్తున్నాడు కాని మానవుడు పరార్థమైన ప్రపంచ సంబంధమైన సామాజికమైన సౌఖ్యమైన తత్త్వాన్ని ఏ మాత్రము విచారించటం లేదు. ఎంతకాలం మన బాధ్యతను మన స్వార్థము నందుంచుకొందుమో అంతకాలం మనదేశమున కేమాత్రము క్షేమముండదు స్వార్థాన్ని త్యాగం చేసి దేశ సౌభాగ్యాన్ని దేశకల్యాణాన్ని, లోకశాంతిని, మనము ఆశించినప్పుడే మనకును, మన సమాజమునకును, మన దేశమునకును, క్షేమము సంభవిస్తుంది. దీనినే వేదమునందు "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" అన్నారు. మనకు త్యాగమునందే సరియైన క్షేమముంది కాని ఒక విధమైన భోగమునందు క్షేమము ఏమాత్రము లేదు,

మనము ఒకవైపు ఆహారాన్ని భుజిస్తున్నాము. ఈ భుజించిన ఆహారాన్ని మరొకవైపున మనము త్యాగము చేయకుండిన మన ఆరోగ్యము క్షీణిస్తుంది. మనము ఒకవైపున గాలిని పీల్చుకొంటున్నాము ఆ పీల్చుకొన్న గాలిని మరొకవైపు మనము విడువకుండా వుండిన మన lungs చెడిపోవును. మన హస్తంపైన ఒక భాగంలో రక్తం ప్రసరిస్తూ వుంటుంది. ఈ ప్రసరించే రక్తము అక్కడనే నిల్చివుండిన అక్కడ ఒక Boil తయారవుతుంది. కనుక మనము సర్వ విధములయందు కూడ సర్వ రంగముల యందు కూడ త్యాగము, త్యాగము, త్యాగమనే స్ఫూర్తితో సంసిద్ధంగా వుండాలి. తన క్షేమాన్ని త్యాగం చేసి, లోక క్షేమాన్ని లక్ష్యమందుంచుకొన్నప్పుడు, మన క్షేమము కూడ ఆ లోకక్షేమంతో ఏకంగా వుంటుంది. కనుక మొట్ట మొదట ఈ departmentలో మనము చేరినప్పుడు అనేక శ్రమలకు అనేక బాధలకు అనేక కష్టములకు సంసిద్ధమై లోకక్షేమమును లక్ష్యమున నుంచుకొని భగవద్విశ్వాసమును పెంచుకొని, తద్వారా మన కర్తవ్యాన్ని (duties) ను నిర్వర్తించుకోవటములో సంసిద్ధులుగా వుండాలి. ఈ విధంగా దైవముపైన విశ్వాసము కలిగి మన కర్తవ్యాన్ని విశ్వసించి తద్వారా dutyని మనము సక్రమంగా చేసుకొంటూ పోవటమే ప్రధానమైన మార్గము: ఇది మానవునియొక్క ఉన్నతికి నిచ్చెన. నా దృష్టిలో ఎక్కడా diciplineఏమాత్రము కనిపించటం లేదు ప్రతి అధికారి కూడ ప్రతి leader కూడ discipline discipline discipline అని అంటున్నాడే కాని, చెప్పేటు వంటి వ్యక్తియందే discipline లేకుండా పోయింది. ఈ disciplineను చక్కగా develop చేసినప్పుడు మన dutyని చక్కగా సక్రమంగా నిర్వర్తిస్తాము.

ఈ అన్నింటిపైననూ "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధను మనము అభివృద్ధి పరచుకోవాలి శ్రద్ధకలిగిన వారికి అలభ్యమైన పదార్థము కూడ లభ్యమవుతుంది. అప్రాప్తమైన వస్తువులు కూడ ప్రాప్తిస్తాయి. శ్రద్ధ అనేది ఒక సాత్వికమైన లక్షణము. అశ్రద్ధ అనేది తమోగుణ లక్షణము. ఈ తమోగుణ లక్షణము కలిగినట్టి వారికి ఏ విధమైన త్యాగము కూడ ఉండదు. సాత్విక గుణము కలిగినవారు నిరంతరము ముందంజనే వేస్తుంటాడు. అశ్రద్ధకలిగిన వారు ఎల్లప్పుడును, వెనుకంజ వేస్తుంటారు. ఈ అశ్రద్ధ అనేది ఒక సోమరి లక్షణము. ఈ సోమరితనం సాత్వికమనే శిఖరాన్ని ఏమాత్రము అందుకోలేదు. కనుక శ్రద్ధకలిగిన వారికి కించిత్తు నిప్పు ఇచ్చినప్పటికిని, దానిని అనేక విధములుగా ప్రోత్సాహ పరచి అభివృద్ధి పరచుకొంటారు శ్రద్ధలేనట్టివారికి తట్టెడు నిప్పు ఇచ్చినప్పటికిని దానిని ఆరగొట్టుకుంటారు. శ్రద్ధలేనివాడు తన Store-roomలో సర్వ పదార్థములు ఉండినప్పటికీ సోమరితనము చేత వండుకోక తన ఆకలిచేత తానే బాధపడవలసి వస్తుంది. శ్రద్ధకలిగిన వారు ఏ పదార్థములు లేనప్పటికీ తాము ఏదో విధముగా ప్రోగుచేసుకొని ఆహారాన్ని భుజిస్తారు. కనుక ఈనాడు మనము శ్రద్ధను అభివృద్ధి పరచుకోవాలి. మనము ఏ విద్యలు నేర్చుకోవాలని ఇక్కడకు వచ్చామో ఏ దానిని మనము తెలిసికోవాలని వచ్చామో, దేనిని ఆచరించాలని వచ్చామో దానిపైన శ్రద్ధను అభివృద్ధి పరచుకొని తద్వారా మన లక్ష్యాన్ని మరల్చుకోకుండా దేశానికి ఉపకారమయ్యే లక్ష్యముతో ముందంజ వెయ్యాలి కేవలము ఈ ప్రదేశాన్ని చేరటము, ఎక్కడెక్కడో వున్న దూర ప్రాంతముల నుంచి ఇక్కడకు వచ్చి చేరటము మనము నేర్చుకోవలసిన విద్యలను, తెలిసికోవలసిన మర్గమును మనము చేయవలసిన కర్తవ్యాన్ని గుర్తించుకోకుండా పోవటంచేత కేవలము మనకు మనమే ద్రోహం చేసుకొనే వారం కాకుండా మన దేశానికి కూడా ద్రోహం చేసిన వారమవుతాము. మనము జీతం కోసం జీవించడంలేదు. జీవితం కోసం జీవిస్తున్నా

మనే సత్యాన్ని గుర్తించాలి ఈ విధమైన త్యాగానికి పోలీసులు మిలిటరీ డిపార్టుమెంటు అంతా కొన్ని విధములైన శ్రద్ధకు పూనుకొన్నప్పుడే మన దేశము రక్షింపబడటానికి అవకాశ ముంటుంది. మిలిటరీవల్ల నిరంతరము వారికి తగినటువంటి రక్షణ ఉండనక్కరలేదు. కాని పోలీసులచే నిరంతరము వారికి రక్షణ అవసరమే. కనుక ఈ Hyderabad camp లో training కావటానికి వచ్చినటువంటి వ్యక్తులందరు అన్ని విధాల తగినటువంటి శ్రద్ధా భక్తులతో భగవద్విశ్వాసమును అభివృద్ధి పరచుకొని దేశరక్షణను దృష్టియందుంచుకొని, మన పూర్వపు దృక్పథమును మార్చుకొని ఈ దేశ కల్యాణమునకు తగిన రీతిగా కొన్ని అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టి తద్వారా సత్కీర్తిని సాధించి దేశరక్షణను అభివృద్ధి గావిస్తారని ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను

ముఖ్యముగా మనము దైవవిశ్వాసమనేటువంటిది లేకుండా ఏ విధమైనటువంటి కార్యమును ఆచరించి నప్పటికిని, అది జీవము లేని శవరూపము ధరిస్తుంది. ఈనాడు ప్రతి మానవునికి దైవప్రీతి, పాపభీతి ఈ రెండు కూడ అత్యవసరము ఈనాడు దైవప్రీతి, పాపభీతి కోల్పోవటంచేతనే మానవుడు అనేటువంటి పేరునకు విరుద్ధమైన పేరుతో దానవుడు అనే సార్థక నామము అందుకొంటున్నాడు. నిజముగా మనము మానవులము. పవిత్రమైన మానవత్వము మనకు చిక్కినప్పటికినీ దానిని సక్రమమైన మార్గంలో వినియోగించలేకుండా పోవటము, ఇది నిజముగా పెద్ద దోషమే. "జంతూనాం నరజన్మ దుర్లభం" అనేక లక్షల జీవరాసులలోపల మానవజన్మ ఉత్కృష్ట మైనట్టిది. ఈ విలువైన మానవత్వాన్ని కేవలము మసి బొగ్గును కప్పుకునే అజ్ఞానులుగా మనము తయారు చేయకూడదు. ఆహార నిద్రా భయమైథు నాదులయందే నీయొక్క మానవత్వాన్ని అంకితం గావించకూడదు. దేశాన్ని రక్షించే త్యాగములో మునము ముందంజ వేయాలి. సత్యాన్ని నిలబెట్టే దీక్షలోపల మనము నిల్చి మన ధ్యేయాన్ని పొందాలె. ఈ విధమైన సత్యశీలురై త్యాగశీలురై పవిత్ర హృదయులై ప్రపంచమునకు సరియైన ఆదర్శాన్ని అందిస్తారని నేను ఆశిస్తున్నాను.

వారి పన్యాసము
29-3-79.

నేషనల్ పోలీసు అకాడమీ
హైదరాబాద్



## సాధకుడు ఆచరించవలసిన విషయములు

కోపము, గర్వము, మమకారము, ఇతరుల తప్పులు కనిపెట్టు తెలివి ఆసక్తి, కృత్రిమ బుద్ధి ఇత్యాది గుణములు ధ్యానమునకు కఠినమైన ఆటంకములు: వాటిని చేరనీరాదు. సాధకుడు, స్వల్ప విషయములందుకూడా త్వరగా కోపించకూడదు. అట్లుండిన ధ్యానమందు ఎంతమాత్రము వృద్ధి జరుగదు. సాధకుడు తన తప్పులు ఎవరైనా బయటపెట్టిన, అప్పుడు ఓపికతో వానిని సర్దుకొనుటకు ప్రయత్నించి, తన తప్పులను తెలిపినవారికి కృతజ్ఞతగా ఉండవలెను.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ ఫెట్ ఆంధ్రానువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 3 | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |
| 4. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 5. | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 6. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 7. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 8. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 9. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 10. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 11 | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 12 | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 13. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 14. | భజనావళి | 2-00 | 0-20 |
| 15. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 16. | ఆధ్యాత్మిక బోధిని | 1-00 | 0-10 |
| 17. | బాల వికాస్ బోధిని | 2-00 | 0-20 |
| 18. | నీలగిరి వేసవి వెన్నెల | 2-00 | 0-25 |
| 19. | సందేహ నివారిణి | 2-00 | 0-25 |
| 20. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది ఎడిటర్ : యన్. కస్తూరి

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా డువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసునందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును ందా నంబరును వ్రాసి పంపవలెను.

**B**(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల **పూర్తి** పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను **పూర్తి** వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : **240** వ పుటలో చూడండి )

## దృష్టి నొక జ్యోతి మీద కేంద్రీకరించు

దృష్టి నొక జ్యోతి లేక దీపిక మీద కేంద్రీకరించుము, ఆ జ్యోతి భ్రూమధ్యము ద్వారా నీ హృదయ కుహరము ప్రవేశించు చున్నట్లూహింపుము. నీ యందున్న ఈర్ష్య, ద్వేష, అసూయ, అహంకారములు ఈ జ్యోతిచే భస్మీపటలమైనవని ఊహింపుము. ఈ జ్యోతి అంగ అంగమునందూ నీ శరీరమంతటా వ్యాపించనిమ్ము. తదుపరి ఆ జ్యోతిని కపాలము ద్వారా బహిర్గతము చేసి దానిని సమస్త మానవాళికీ, మిత్రులూ, శత్రువులూ అను భేదము చూపక అందరికీ ప్రసరింప జేయుము.

— బాబా